శ్రీరస్తు.

శ్రీ

# భజన సత్యహరిశ్చంద్రీయము.



ఆఱంకముల నాటకము



ఇది

రంగుల నారాయణరెడ్డిగారిచే

విరచితము.

గుంటూరుజిల్లా నరసారావుపేటతాలూకా సంతగుడిపాటి

నివాసులగు పల్లకి రామిరెడ్డి తిమ్మాజీసింహుం

కృష్ణారెడ్డిగారి

ద్రవ్యసహాయముచే

నరసరావుపేట కోటేశ్వర ముద్రాక్షరశాలయందు,

ముద్రించబడియె.

1936.

# ఈ నాటకమునగల పాత్రలు.

## పురుషులు.

ఇంద్రుడు
వసిష్ఠుడు
బృహస్పతి
గౌతముడు
విశ్వామిత్రుడు
అగస్త్యుడు
నారదుడు
హరిశ్చంద్రుడు
సత్యకీర్తి
లోహితాస్యుడు
సూతుడు
ధర్మారెడ్డి } వారులు
కరణప్ప }
కమలగిరిరావు }
నక్షత్రకుడు
భేతాళుడు

శంభులింగం } వీరజంగములు
వీరలింగం }
వీరబాహు
బూచయ్య
కాలకౌశికుడు
జనార్దనుడు
కేశవుడు
భద్రకుడు
పరమేశ్వరుడు
ద్వారపాలకుడు రాజభటులు
భేతాళునియొక్క పరిజనము
లింకనువత్తురు.

## స్త్రీలు.

చంద్రమతి
మాతంగకన్యలు
కాలకంటకి
పార్వతి

# పీఠిక.



పారమార్థిక జనులారా! భక్తగ్రేసరులారా!

యీ భజన సత్య హరిశ్చంద్రీయము వ్రాయుటకు భజనపరుల సంకల్పమే నాకు బలమునిచ్చెను. పరాత్పరుడో సంయుక భక్తులహృదయమే పరాత్పరుని హృదయము. యిక నే చెప్పవలసినదేమనగా, ఒకసారి సత్యలోకములో బ్రహ్మ సభలో ఋషులు సత్యమునకు సరివచ్చునదేదియని పృచ్ఛచేయగా సత్యమును నొకవైపు ప్రపంచమునొకవైపు త్రాసునందుంచగా నా త్రాసు ప్రపంచమువైపు తేలికయియ్యెను. అట్టి సత్యము హరిశ్చంద్రుని నిల్పెను. హరిశ్చంద్రుడీ సత్యము నిల్పుటకు పెద్ద సహాయ్యముజేసినది చంద్రమతి యీ దంపతుల చరిత్రము పాడిన వినిన నాట్యమున సల్పిన పుణ్యము రాకతప్పదు. యిది ఆఱంకముల నాటకము. ఈ నాటకము నచ్చొత్తించ ధన సహాయము జేసినవారు గుంటూరు జిల్లా నరసారావుపేట తాలూకా సంతగుడి పుర నివాసులు పల్లకి రామిరెడ్డి కోటమ్మగార్ల సుపుత్రులైన శ్రీయుత కృష్ణారెడ్డిగారు వీరు మంచి వంశములో జన్మించిన వారు వీరిసోదరు లిరువురున్నారు. పెద్దవారు కోటిరెడ్డి, సుబ్బారెడ్డిగార్లు వీరికన్న చిన్నవారు రామస్వామిరెడ్డిగారు వీరి మేనల్లుడు శ్రీయుత కాపా వెంకటసుబ్బారెడ్డిగారు క్రీ॥ శ॥ 1930-31 లో సంతగుడిపాటి గ్రామములో ఊరిక పడమరదరిగా మంచినీళ్ళ నుయ్యి త్రొవ్వించి దానికి గిలకలు గట్టించి పరోపకారముగా జనుల కుపయోగపరచెను. పైని చెప్పిన ధనసహాయులు శ్రీ కృష్ణారెడ్డిగారి కొమరితె రామమ్మ యను పేరుగల్గిన సాధ్వీమణిని కన్యాదానరూపకముగా యీ వెంకటసుబ్బారెడ్డిగారికి కొసంగి భూదాన గోదాన హిరణ్యదానములతో సహా నిచ్చిరి. ఈ కృష్ణారెడ్డిగారికి రెండు సమంధములు మొదటిభార్యకు మగసంతానము లేనందువలన నెల్లూరుజిల్లా కంగపోలు తాలూకా యినముల మెరూరు గ్రామనివాసులయిన దుంపా వీరస్వామిరెడ్డి కోటమ్మగార్ల గర్భమా

క్తి కయనంబరగు సుబ్బమ్మయను సుగుణవతిని వివాహమాడెను. అంతట ఆమెకు యేసంతానములేక యుండెను. యుండియు భర్తకు యెడమభుజమై యుండియు కుడిభుజము గూడ వాలకుండ సహాయ్యముజేయుచుండెను. జ్ఞానమును కొమరుని సంపాదించుకొని భర్తకు అన్నివిధముల సేవజేయు సుశీల భర్తయే భగవంతుడను పరమ సాధ్వి అతిథి యభ్యాగతుల యెడ ప్రేమసురాలి బాంధవులన్న, తోబుట్టు వారన్న ఆదరించు ఆర్యచరిత పెద్దలన్న పరమభక్తి జూపించెను భక్తురాలు పుణ్యకథలు వినుచుండును పుణ్యవ్రతములు జేయుచుండును. శ్రీయుత కృష్ణా రెడ్డిగారి సుగుణములు వారిని చూడగనె కనుపించుచుండును. వారు పెద్దలన్న అతి ఆదరణతో జూతురు. పాడిపంటయందుల అదృష్టవంతులు భక్తులు భక్త పోషకులు దీనపోషకులు వీరల దంపతి సమేతంబుగా వీరి కుటుంబమునకు భగ వంతుడు అన్నివిధముల కృపజూచి రక్షించుగాక. వీరి సంపత్తు వీరి కుటుంబము నకు భోగా మిగిలినదానిచే యిటువంటి పుణ్య కార్యములకే వెచ్చింప జేయు గాక.

సంతగుడిపాడు
స॥ సా॥ తా॥
ది28–3–36.

గంగుల నారాయణరెడ్డి.

# నాంది.

(యిరువురు వ్యక్తులు)

మొద—గీ॥ శ్రీకరంబగునట్టి యీ ♦ చిద్విలాస
మొనరుగాంచెదగోయన ♦ భువనములకు
తండ్రినారాయణుండన ♦ ధర్మమయ్యె
భక్తజనముల కికమీద ♦ భయమదేమి.

మిత్రమా. యీదిన మెంత సుదినమోయి యీ సుజనసభను గాంచుటగల్గినది యెందులకో వీరలంత యిచ్చటకు దయచేసియున్నారు.

రెం—ఓహో మిత్రమా: నీవెరుగవాయేమి యీదినము శ్రీయుత గంగులనారాయణరెడ్డిగారిచే రచియింపబడిన శ్రీభజన సత్యహరిశ్చంద్రీయము మీహాలులో ప్రదర్శింపబోవుచున్నారు.

మొద—మనమా ప్రయత్నములో రాలేము గాన యింటికివెళ్ళి రానద్దు. అదిగో నారదుని సంగీతముగూడ వినవచ్చుచున్నది. మొదటిరంగము సురసభగాబోలు.

రెండ—ఔను. నాకు రాగనె మన బావ వసిష్ఠుడు సత్యమును గురించి చక్కగా వర్ణించుచును తొందర.

(తెరబడును.)



శ్రీ

# భజన సత్యహరిశ్చంద్రీయము.



## ప్రథమాంకము

రంగము—సురసభ.

( ఇంద్రుడు, బృహస్పతి, వసిష్ఠుడు, విశ్వామిత్రుడు, అగస్త్యుడు, గౌతముడు, ఆసీనులై ప్రవేశింతురు )

ఇంద్రు— గురువరా నారదుడేల ఆలస్యము జేయుచున్నాడు.

బృహ— భగవద్ధ్యానము జేయుచు వచ్చుచున్నాడు.

నార— శ్రీమద్రమారమణ గోవిందో హరిః

కీర్తన.

శ్రీ కైలాసవి జేయుత వరద

1 శ్రీకరవందిత శ్రీశివపూజ చేకొనరాదటర భక్తుల ॥ శ్రీ ॥

2 నారాయణకవి భావమనక భువి రారమ్మనలేద ముక్తుల ॥ శ్రీ ॥

ఇంద్రు— (లేచి) నారదమునీంద్రా! నమస్కారము దయచేయుము.

నార— (సభవంక జూచి తనలో) బలె (ప్రకాశముగా) కల్యాణాం భవతి.

వసి— గీ॥ (పూనికతో)

అన్నదానము లొనరించు ♦ నట్టి ఫలము
యశ్వమేధము లొనరించు ♦ నట్టి ఫలము
నరసు తీర్థయాత్రలవచ్చు ♦ నట్టి ఫలము
సత్య నిష్ఠని ఫలముతో ♦ సరిగరాదు.

ఇంద్రు—మునిజన గరిష్ఠా వసిష్ఠా సత్యమునుగూర్చి చక్కగా వక్కాణించితిరి.

వసి—దేవేంద్రా! వేనల్కేల సృష్టిస్థితిలయంబులీ సత్యమునకే నాధారపడియున్నవి. సత్యమునకు పరబ్రహ్మమునకు భేదము లేదు. యిక దీనితో సరివచ్చునదేమియుగలదు.

గీ॥ యెన్నికష్టాలువచ్చిన ♦ యోచకుండ
నింక చావువచ్చినమది ♦ ఒంపకుండ
సత్యమేవేళలనైన ♦ సాదుబుద్ధి
తప్పకుండినవాడె పో ♦ ఘనిణిపెద్ద.

యెవరయినగాని సత్యముదప్పకుండుటె నుత్తముపద్ధతి అట్లు దప్పకుండినవాడె సుస్థిరుడు.

బృహ—నిజము వసిష్ఠా నిజమునిజము.

అగ—సత్యమేజయమను నార్యోక్తి పుట్టినదందులకే కదా.

నార—చాలుచాలు మైత్రావరుణి మాధుర్యము మాధుర్యము.

గౌత—బ్రహ్మనిష్ఠా! వసిష్ఠ నీవుజెప్పు ఉపన్యాసంబు సకలలోక సమ్మతమైయున్నది యిటువంటి యుపన్యాసంబు విన్నదినమే సుదినము.

విశ్వా—(తనలో) ఛీ ఛీ బంతికూటికి వెళ్ళిన నిల్లిపప్పున్నట్లు సుర సభకువచ్చినను ఈవసిష్ఠుని నీతివాక్యములే వినవలసివచ్చెను. అదియునుగాక ఇంద్రునితోసహా యితడుజెప్పు యుపన్యాసంబుల కెలరారుచుండిరి. యెట్లైన యితని ప్రాబల్యము బోగొట్టి అవమానపరచజూచెద.

నార—(తనలో) ఈవేళ్ల నాకు చాలినంతపస్పున్నము యిక్కడనే,

యెక్కడకు వెళ్ళవలసినపనిలేదు. (పరిహాసముగా) విశ్వామిత్రా ఈవసిష్ఠుని సత్యోపన్యాసంబు నీకు రుచించలేదయేమి మాటాడకుంటివి.

విశ్వా—(హేళనగా) మీయందరికి రుచించితేచాలులే యీతని నిరర్థకమయిన యుపన్యాసము.

వసి—ఏమివిశ్వామిత్రా! నా యుపన్యాసంబు నిరర్థకమయినదా.

విశ్వా—ఒకనాటికి రెండునాళ్లకు మూడునాళ్లకు పన్నెండునాళ్లకు

వసి—ఏమి దానికారణము.

విశ్వా—ఏమికారణమా. నోటికివచ్చినట్లు యెన్నిమాటలైన జెప్పవచ్చును గాని నడచుటకు మహాకష్టము కష్టములేని సత్యమార్గము తెలుసుకొనెట్లు జెప్పియున్నాడో చూడు.

వసి—ఏది

విశ్వా—గీ। వారిజాక్షులందు ♦ వైవాహికములందు
ప్రాణవిత్తమాన ♦ భంగమందు
చకితగోకులాగ్ర ♦ జన్మరక్షణమందు
బొంకవచ్చునఘము ♦ పొందదధిప॥

అట్లుండాలి నీతిజెప్పితే

ఇంద్ర—గాధిపట్టి నీవుజెప్పిన యుక్తి చాలాబాగుగానున్నది శుక్రుడు జెప్పినధర్మశాస్త్రప్రకారము యిక అబద్ధమాడవలసిన నవసరమేలేదు గాని వసిష్ఠుడుజెప్పిన నిష్ఠయే సత్యమును గురించి బాగాయున్నది.

విశ్వా—ఓహో. ఇంద్రా ధర్మశాస్త్రముల బలపరుచుటకు కూడ నీకు తెలివున్నదని నాకిదివరకు తెలియదే.

వసి—ఉత్తమాటలేలర ఉన్నదేదో తెల్పర
ఎత్తిలేమనికురా। పసునైన మేలురా। పల్ల॥

విశ్వా—వేనా! పసువుకన్న హీనుడవు నీవు. ముప్పదిమూడుగోట్ల దేవతలకు ప్రభువైన దేవేంద్రుడిచ్చటయుండ బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టిచేసిన యపరబ్రహ్మను నేనుండ మహామహులయిన మునిపుంగవులు వినుచుండ నిత్యము సత్యంబులు చవిజూచు నారా చపట్టియగు హరిశ్చంద్రమహారాజు అబద్ధమాడడని పల్కితివి మూర్ఖా తెలిసికొనుము యికమాటలాడకుమునోరుమూయుము.

నార—(తనలో) నేను మునిపెట్టకమున్నె యీమాటలుబాగుగానాకు తెలుసుకున్నవి (ప్రకాశముగా) వసిష్ఠ ధైర్యమున్న మాటలాడుము ఆలస్యమెందులకు

గీ। మంచిసిరులుండు నయ్యుల ♦ మించుశతము
భావిమహాభావ్యంబులు గాపని ♦ వసులకంటె
క్షత్రియపుత్రులుశతంబులకు శ్రీ ♦ సుతులకు మేలు
మాసుతశతకములకు మీ ♦ పనికి మేలు.

వసి—ఈక త్రికోతగానిమాటలు పాటికివచ్చునా హరిశ్చంద్రుడబద్ధ మాడునా.

యు॥ప్ర—వసిష్ఠా! అధికప్రసంగములేలను. మహారులారా మానవ మాత్రులై రాజ్యభోగముల ననుభవించు హరిశ్చంద్రుడబద్ధ మాడడనుమాట నమ్మదగనిమాట.

విశ్వా—అతడబద్ధమాడడనుమాట పొట్టబోసుకొనుమాట

వసి—గీ। సత్యహారధుడెంకేని ♦ చంద్రసూర్యు
లలమిగతిదప్పిపొడచిన ♦ యేకమైన

భూమియాకాశములుతిర్గి ♦ భూవిగుణుకు
యీహరిశ్చంద్రుడుయుబద్ధ ♦ మాడకుండు.

నా యీమాటలు హరిశ్చంద్రుడు నాశిష్యుడని చెప్పుట గాదు యదార్థము.

విశ్వా—— వసిష్ఠా! యెంతసేపు మాటలాడిన వరిగడ్డపుమాట లేనా?

వసి——నావిగావు

విశ్వా——ముసలవాడవైన నీవేయిట్లు గట్టిగామాట్లాడుచుండ యిక నేనూరుకొనెదన హరిశ్చంద్రుడబద్ధమాడడా.

వసి——ఆడడు

విశ్వా——నేను హరిశ్చంద్రునబద్ధమాడించెదను యేమిమోడెదవు.

వసి——నీవు హరిశ్చంద్రునబద్ధమాడించినట్లైన నేను తలగొరిగించు కొని ఖరవాహనమెక్కి మనుష్యాతిల పుఱ్ఱెలో భోంచేయుచు వాడ వాడల నుత్తరదిశకు నూరేగెదను.

నార——నీవేమోడెదవిశ్వామిత్ర.

విశ్వా——మంచుపర్వత శిఖరాగ్రమునయి పవనభక్షుణ సేయుచు ఈశ్వరుని మెప్పించ నూరు వేలసంవత్సరములు చేయుతపస్సులో సగమిచ్చి సకలసంపదల నిచ్చి స్వర్గములో యీ దేవేంద్రుని సరసన సింహాసనముపయి కూర్చుండబెట్టెదను యింతలకు దప్పినవాడ నయితినా ఆపరమేశ్వరు పాదమునకు దప్పినవాడ నగుదును.

బృహ——ఎందులకింతతొందర విశ్వామిత్రా? ఆవులావులు కలియ బడి లేగలకాళ్లు విరుగదొక్కినవన్నట్లు మీకేకాక యితరుల కుగూడ కష్టములు గలుగుగద. యెవరు ఓర్చుకొనుండ పోదు.

విశ్వా—ఆహా యేమి నీఓర్పుతనము బృహస్పతీ. కొమరునికై నీవు నీశిష్యునకు తగాదపెట్టుకొన్నప్పుడు నీవు కొంచెము ఓర్చుకుంటివి గా చాలుచాలు ఒకరికి చక్కట్లు జెప్పుట కందరము పెద్దలమే.

నార—మనకేల బృహస్పతీ వారువారు సమానులు యెట్లనుకున్నా సరిపోవును.

విశ్వా—నారదా! ఏమంటివి నక్కకు దేవలోకమునకు పోటీపెట్టుచున్నావె మే మిరుపురము సమానమా: నీకు తలదిరిగి నాలుక నోట్లోకి వస్తున్నదే నీ దేశపెరుగుకుమాట లెక్కడ చాలించుము మాట్లాడితె పక్షపాతము లేకుండ సమముగా మాట్లాడుము.

గౌత—సంగతిసందర్భము తెలియకుండ విశ్వామిత్రా, యేల నట్లు మాట్లాడెదవు. పాపము జెప్పినా ఒకటి పుణ్యముజెప్పినా ఒకటేనా నీ కోపమునకు.

విశ్వా—అవును. సంగతిసందర్భము నాకేమి తెలుసును గౌతమా! నీకు తెలుసును నీకు తెలిసినసంగతి నాకన్న యింద్రునకు బాగా దెలుసును.

గౌత—ఛీ. యిక్కడయుండినకొలది ప్రాతసంగతులన్ని బయట బడుచున్నవి వెళ్లుటమంచిది (అని నిష్క్రమించుచున్నారు.)

ఇంద్రు—ఏమివిశ్వామిత్రా, చిన్నపెద్ద తెలియకుండమాట్లాడెదవు

విశ్వా—నిజమె మోహముచేత దిబ్బమీదకోడివై కూసిననాడు చిన్నపెద్ద విచారించి కూసితివిగాబోలు.

నార—ఏమి బృహస్పతియింద్రుని తూలనాడుచున్న మాట్లాడకుంటివి.

అగ—నారదా! నీ పుసికల్పనము యిక చాలించుము విశ్వామిత్రా వెళ్ళుదమురమ్ము యింద్ర,వసిష్ఠ, బృహస్పతులారా మీరు వెళ్లుడి.

విశ్వా—వసిష్ఠా! నేను వెళ్లుచుంటి నీ శిష్యునకు ముందుగాబోయి ఏమైన చెప్పుకొనవలసిన సంగతులున్నవా చెప్పుకొనుము.

వసి—పుట్టుకతోడనె సత్యగుణముచేత బుట్టిన హరిశ్చంద్రునకు నే జెప్పవలసిన దేమియు లేదు.

విశ్వా—నీవు బెట్టినపందెము దప్పవుగద.

వసి—సూర్యచంద్రులు గతులుదప్పిన దప్పను.

(అందరు నిష్క్రమింతురు నారదుడీగీతమును బాడుచు నిష్క్రమించును)

నార గీతము.

1 నీలోననీవుజూడు । నీకన్న నెవరు లేరు
మూలంబుగానకీవు । మోహంబుజెందెదావు ॥ నీలో ॥

2 నిఖలస్వరూపమెన్న । నిత్యమైయున్న దన్న
సుఖమేదెజూడుమన్న । జూచెడివారికన్న ॥ నీలో ॥

3 నారాయణస్వామిదారి । నడచినవారికోరి
వేరేమిలేమరోరి । వేదాంతవేద్యశౌరి । నీలో ।

ఇది ప్రథమాంకము.





శ్రీరస్తు.

శ్రీ

# భజన సత్యహరిశ్చంద్రీయము.



## ద్వితీయాంకము

(అంతట నపుడే విశ్వామిత్రుడు ప్రవేశించుచున్నాడు)

విశ్వా—ఏమీ, వసిష్ఠునిపై కక్షచే హరిశ్చంద్రు నబద్ధమాడించెదనని నాటినుండి యిప్పుడు వసిష్ఠునకు జయము నాకపజయము రానున్నట్లు తోచుచున్నది. కాని నేజేయు మాయాజాలంబుల హరిశ్చంద్రుడు బడడేని నారాజవంశపుకీర్తి యుగాయుగములు మాయకయుండును. లేక మాయాజాలంబుల బడెనేని వసిష్ఠునకు తలవంపు దెచ్చినవాడనగుదును. ప్రయత్నముజేసి చూచెదను.

చేసినను గాని మోసము ♦ సిగ్గుపడను
చూచినను గాని మనసుకు ♦ నూటిగాను
దాసినను గాని ద్రవ్యము ♦ బాసిపోదు
మోసినను గాని తెలివియు ♦ ముందుబరువు.

(ధైర్యముతో నిష్క్రమించును.)

(పిమ్మట హరిశ్చంద్ర సత్యకీర్తులు తగినపరిజనముతో ప్రవేశింతురు)

హరి—సత్యకీర్తి మన రాజసూయాధ్వరము చక్కగా పూర్తైనందులకు సంతసమగుచున్నది. మన మాహ్వానించిన వారలలో విశ్వామిత్రమహర్షి యేకారణముచేతనో రాలేదు. తెలిసినను

సత్య—మహాఋషులువారు వారెక్కడ తపస్సుచేసుకొంటు కూర్చున్నారో.

(విశ్వామిత్రుడు ప్రవేశము.)

(హరిశ్చంద్రుడు సత్యకీర్తి యెదురేగి) కుశికనందనా వందనములు. దయచేయుడి మణిపీఠముపయికి (అని మణిపీఠము జూపింతురు విశ్వామిత్రుడు కూర్చున్నతరువాత వారూ కూర్చుందురు.)

హరి—స్వామీ! మీమాట యిప్పుడే యనుకొనుచుంటిమి మీరూ దయచేసితిరి. మాకీ దినము సుదినము.

విశ్వా—(తనలో) సురసభలో జరిగినసంగతి యీతని కేమియు తెలిసినదా యేమి. (ప్రకాశముగా) హరిశ్చంద్రమహారాజా! నేను మీవలన కొంతద్రవ్యసహాయము వడయవలెనని వచ్చితిని

హరి—మహాతపః ప్రభావముచే వెలుంగు మీకు ధనసహాయము గావలయునా.

విశ్వా—పరమేశ్వరునిగూర్చి యజ్ఞము చేయదలచుకొంటిని ఆ యజ్ఞము ధనసహాయము లేనిది యెట్లు సఫలీకృతమవును.

హరి—యెంతగావలయునో సెలవివ్వుడు.

విశ్వా—రాజా! నిన్నడుగవలసినంత ధనసహాయముగాదు అందులకే నేననుమానించుచుంటిని.

హరి—మీవంటి పుణ్యపురుషులకు ద్రవ్యసహాయముచేసిన అదియె గొప్ప పుణ్యముగద.

విశ్వా—సరే. అడిగెదనా?

హరి—అడుగుడు.

విశ్వా—ఏనుగుపై మనుజుడెక్కి గవ్వ గోటమీట నెంతెత్తునకు

గునో సంతద్రవ్యము చాలు.

హరి—చిత్తమూహాగే? సత్యకీర్తి ధనమునిచ్చుటకే తెప్పించుము.

విశ్వా—రాజా! నేను యజ్ఞముజేయ నుపక్రమించిననాడు తీసు
కొని వెళ్ళెదమీధనముతోపాటునాధనమునిచ్చుటనేయుంచుము

సత్య—యెప్పటిమేలప్పుడే మీధనము మీరు నిచ్చుట నుంచక
తీసుకొనిపోవడమే మంచిది.

హరి—గీ॥ ధనముతోమాట నామాట ♦ తప్పగాదు
తల్లిదండ్రులనయినను ♦ తనయసోద
రహితుల సతుల తగినవా ♦ రల నయినను
నమ్మియుండగ రాదని ♦ నమ్ముసుమ్మి.

విశ్వా— కీర్తన.

1 రాజానీయుంకునాకు రవ్వయయినను హరిశ్చంద్ర ॥ రా ॥
పూజితగుణధామా । పోవు నెనుపనమ్మకం । రా॥

2 ధరణిలో మీవంటిధన్యులు । తిరుగుమాటజెప్పరుగద దిన
కరవంశ । రా ॥

3 గంగులనారాయణ నేలు । గంగాధరునిసాక్షిగను కరుణను
గొనుము ॥ రా ॥

సత్య—మునీంద్రా! రాజుగారు విచారించక చెప్పలేరు. మీధన
ము మీతావున మీరే దాచుకొనుటమంచిది.

విశ్వా—నేనా? అంతవిచారించకమాటలాడునది సత్యకీర్తి నేదాచు
కోవడముకు నాకక్కడ కొండలా గోడలా పెట్టెలా జేడలా
ముక్కుబట్టుకొని చెట్టుక్రింద గూర్చొని తపసులధనము దొంగ
ల కలకసగద.

సత్య—మీతపఃప్రభావము చేత దొంగలువత్తుర.

విశ్వా—ఏమీ? మీరిచ్చు మూడుకాసులకు నాతపః ప్రభావము గూడ వ్రయము చేయ మరుచుంటివి. యింతకన్న ఒక్కసారి లేదని యన్న వెళ్లనా!

హరి—అయ్యా, మీయిష్టానుసారము చిత్తగింపుడు.

విశ్వా—సరే యిక నేను వెళ్ళెదను.

హరి-సత్య—(నమస్కరింతురు) స్వామీ! దయయుంచుడు.

విశ్వా—పరమేశ్వరుని దయ మీకుమాకు (పోవుచు) (తనలో) పట్టుచిక్కినదిలె ఆశ్రమముదగ్గరకు యెట్లైన వచ్చునట్లు జేసె దను నా మాయాజాలములో బడవేసెదను. (నిష్క్రమించును)

హరి—సత్యకీర్తి వాగ్దత్తమయిన ధనము నామునిని మనయొద్దనే-యుంచిపోవుటచేత నామనస్సునకు నేదో తొందర గలుగు చున్నది.

సత్య—ఔను. సత్యము నే నాధారముగా తీసుకొనువారికెల్ల కొంచెము యిటువంటిసమయములలో భయము గలుగుచుండును. (పక్కకుజూచి) యెవరో మహావేగముగ వచ్చుచున్నారు.

(ఆతురతతో ద్వారపాలకుడు ప్రవేశించుచున్నాడు)

ద్వారపాలకుడు—దేవా యింకేమున్నది. దేశమునకు ప్రళయము సంభవించినది.

హరి—అదియేమొ నిదానముగ జెప్పుము తొందరపడకుము.

ద్వార—అయ్యా! నేనేమిజెప్పుదును గుంపులుగుంపులు జనులు వచ్చి మనకోట సింహద్వారమువద్ద వేచియున్నారు వారికష్టములను జెప్పుకొనుటకు.

హరి.—ఏమిసత్యా ?
సత్య.—వారిని తొందరగా యిచ్చుటకు వచ్చునట్లు జేయుము.
ద్వార.—చిత్తము. (తొందరగా నిష్క్రమించును)
పౌరులు—యింకేమి వ్యవసాయము బాబయ్య యింకెక్కడి పిల్లలు బాబయ్యా యింకెక్కడితల్లులు బాబయ్యా గోలగోల బాబయ్యా

(పౌరులు ప్రవేశించుచున్నారు.)

పౌరులు— కీర్తన.

రాజరాజమమ్మ రక్షించవయ్య । దండములు దండములు ఉండలేమయ్య । రా ।

1. ధరణీవంశజమమ్మ దయజూడవయ్య । తల్లిదండ్రిదైవ గురు దాతవీవయ్య । రా ॥
2. మొకముల బాధాలు మెండాయెనయ్య । తికమకలై జనము తిరిగి రావయ్య ॥ రాజ ॥
3. వేరుసెనగచేలు పేరులేవయ్య । వూరివరాహముల్ మిగులదినె నయ్య ॥ రాజ ॥
4. జంకపోతులు పందుకంకులన్నియును । ఉంకించి మేసెను బొంకించెనయ్య ॥ రా ॥
5. నారాయణరెడ్డిని నయముగనయ్య । కేదిరక్షించెను శివుని సాక్షయ్య । రాజ ॥

1. ధర్మారెడ్డి, 2 కరండప్ప 3 కమలగిరాత్రివు.

1. పౌరు.—బాబయ్యా! నాగతివిను బాబయ్యా అరక్కాడికి నా పెండ్లాము నాకు బువ్వదెచ్చింది బాబయ్యా, బువ్వదెచ్చి అడ పెట్టి నాకోసరమట్లు గూర్చున్నది బాబయ్య కూర్చున్నాలకి యింతంతవెడుల్పు మచ్చబ్డి బాబయ్యా, అవంతున్న మొత్తుకున్న

సత్య—నిజమే యింతవరకు సందెముక్కలేరాలేదు.

విశ్వా—అవిగో నేను కల్పించిన మాయామృగములన్ని మన ఆశ్రమము ప్రాంతమునకే వచ్చుచున్నవి. హరిశ్చంద్రుఁడునువచ్చుచున్నాఁడు మనముపోదముపద.

(యిరువురు నిష్క్రమింతురు.)

(పిమ్మట హరిశ్చంద్రుఁడు రథారూఢుఁడై భటులతో ప్రవేశించుచున్నాఁడు)

హరి— కీర్తన.

తరిమికొట్టుఁడు మృగములన్నిట। విరివిమీర వెరువకిపుడు॥ తరి॥
పెరికివేసె పైరులన్ని నరికివేసె సస్యములను । ఉరుకుచున్నవి వరాహంబులు ॥ తరి ।

1 కారుమున్నలవిగో తిరిగి దారికడ్డపడెనిమునకు । పోరుపెట్టుతు పాకులను పడగవడిగగాల్చుఁడి ॥ తరి ॥

2 తెల్లగుంపులవిగొచూడు కాళ్ళుయెత్తి దుముకుచున్నవి రాళ్ళతోటి రువ్వివాటి జోళ్లబడిజేయుఁడి ॥ తరి ॥

సారథి మనరథమునకు తూర్పువైపుగా పెబ్బులియొకటి లేచినది దానికూడ మనరథముపోనివ్వుము యిప్పుడు ధనస్సునకు యెక్కుబెట్టిన బాణముచే దానిపడగొట్టెద.

(కొంతదూరముపోయి)

సూతుఁడు—రాజా! పులికానరాక మాయమాయెనదే.

హరి—సూతా! దిగిఅడుగులజాడ బట్టుదముపద(రథముదిగుదురు)

సూతు—రాజాధిరాజా! యీప్రదేశము యెవరో మహానుభావులుండు స్థలముగా గనుపడుచున్నది.

హరి—నిజము. అగాగవచ్చు నెమ్మెగోరంట్లకరకు కారుపత్రాంబులుగూడా నారగట్టియున్నవి సూతుడా మన యేటుకలకు యిచ్చట మృగముల చంపవలదని చెప్పుము సత్యకీర్తీ చంద్రమతి లోహితాస్య లెంతదూరమున నుండిరో,

సూతు—అదిగో ఆకనబడు రథములో రాణిగారూ లోహితాస్యులువచ్చుచున్నారు.

(రథారూఢులై చంద్రమతి లోహితాస్యులు ప్రవేశించుచున్నారు)

(పిమ్మట సత్యకీర్తి ప్రవేశించును)

హరి—(ఎదురేగి) నాయనా, లోహితాస్య యీ యరణ్యమృగములజూచి భయపడలేదుగదా.

లోహి—జనకా నాకేమిభయము నిచేతులోవున్న ధనస్సు నాచేతులోయున్నట్లయితే నిన్ను తరుముకవచ్చిన బెబ్బులిని పోనిస్తునా.

హరి—(కౌగలించుకొనును)

సత్య—బాబూ, నివంటివాడవే యగుదువు.

చంద్ర—ప్రాణేశ్వరా! యీప్రదేశము చాలా ప్రశాంతముగానున్నను చూచుటకు నాకేమో భయముగానున్నది.

హరి—చంద్రమతీ! యిదియొక మహాఋషియొక్క ఆశ్రమప్రదేశము యిచ్చట భయములుండవు నాకేమొ యాశ్చర్యముగానున్నది. నిద్ర కన్నులపైకివచ్చి తూగుచున్నది.

చంద్ర—స్వామీ! ఆశ్చర్యమేమున్నది. మీరు ఘోర మృగహరణము కోసరమై శరీరపరిశ్రాంతి నేడు యెక్కువగా జేసితిరి. అందుచే మీకాశరీరమంతడప్ప నిద్రవచ్చుచున్నది. యీగున్న

మామిడివృక్షముక్రింద పూలసెజ్జ జేసెదను నాయంకతలంబున. తలనిడి కొంచెము పరుండుము.

హరి—భగవంతునిసృష్టిలో పగటిపూట నిద్రకు అర్హమయినది కాదు. నిద్రఅనగానె నిన్న పడితేయుగన్న దుష్టకల జ్ఞాపకము వచ్చుచున్నది.

చంద్ర—అయ్యో ప్రాణపతి అది యెట్టికల.

హరి—గీ॥ నింగికొలువున నేనుండి ♦ దండితపసి
యొకడునరుదెంచి తన్నుక్రిం ♦ దకును నెట్టి
కారణములేక తనుపరి ♦ కానలందు
రాజ్యమంతయుగొంబడి ♦ రాణిగుమరు
లుంబడినయట్లుగంటినే ♦ లెంకొనగంటి.

చంద్రి— కీర్తన.

ప్రాణనాథకలనుగనుట । పాపమేమొపుణ్యమేమొ
ప్రాణికోట్లకునెల్ల । ఫలంబేమొ ఫలంబేమొ। ప్రాణ

1. యెన్నెన్నొసుఖములను । యెన్నెన్నొ కష్టములను
కష్టములను కన్నయట్లు ఉండుచుందును । కానరావు లేచి చూడ॥ ప్రాణ॥

2 నిన్నరాత్రినిద్రలోను నీవుగన్నకలయొగంటి కలయొగంటి
మున్ను యేమిజరుగగలదో విన్నదనియుకాదుకాదు॥ ప్రాణ॥

సత్య—దేవీదేవులారా! మీకీకలకు విచారమవసరములేదు మనుష్యుడు దేనియందు స్మరణయెక్కువగా బెట్టియుండునో దానిని నిద్రలో గనుచుండును యిటువంటి సమయమున కాలం వినోదముగా గడుపుటకు గానవిద్యాపరిచయులైన మనయాశ్రితులయిన లేరెరి.

(ఇరువురు మాతంగకన్యలు)

చిన్న—అక్కా! యీవనశృంగారము జూచితివా.

కీర్తన.

పొన్నలుపొగడలు పూపొదరిండ్లును వన్నెలు గుల్కుచు
నున్నవిజూచితివా ॥ పొ ।

పెద్ద—ఆహాచూచితి ఆనలగనుగొను । అరటికంభములు అందము
బూనులు । ఆ ।

చిన్న—ఈప్రక్కకుజూడీ నువ్వుగిటుకులు । యేప్రకారముగ యెను
గుచున్నవో । పొ ।

పెద్ద—నెమలుగుములు పిపికపూపము । తుదలు గనుపడక
తూగుచున్నవి । ఆ ॥

చిన్న—సరసిజములగను సౌందర్యంబును । చాటుగజూచిన చక్క
గనున్నవి । పొ ।

పెద్ద—వాటికిగ్రివ్వినవచ్చిన మధురము లేఁబిల్లుత్రాగి తిరుగుచు
నున్నవె । ఆ ।

చిన్న—హంసలు నీటిపై ఆడుచున్నవి । అరువకుమింకను అక్క
నొంపూతము ॥ పొ ॥

(మెల్లగా చేసైగలచే ముందునకు నడుచుచున్నారు)

పెద్ద—అమ్మాయి వారెవరో చూడు రాజులకుమల్లె యున్నారు.

చిన్న—వారే హరిశ్చంద్రమహారాజు వారిప్రక్కగా యున్నదే
చంద్రమతి ఆకుఱ్ఱవాడే లోహితాస్యుడు వారికేదో చెప్పుచు
యున్నవాడేసత్యకీర్తి అనగా మంత్రి.

పెద్ద—అమ్మాయీ చెల్లీ అలాగయితే యిక ఆలస్యమెందులకు

(మాతంగకన్యలు ప్రవేశించుచున్నారు.)

మాత—దీనజనమందారా దివ్యకీర్తికాంత కలంకారా జోహార్.

హరి—సత్యకీర్తీ యెవరోవీరు కనుగొనుము.

మాత—రాజా! మాతంగ కులాంగనలము. మమ్ముల మాతంగ కన్యలందురు.

గీ॥ సరసవచనరచనలందు । సరిగరాదు
నాసరస్వతి యైనను । హానుభావ
మాతో జెప్పవలసివచ్చె । మీతో జెప్ప
చుంటిమియిపుడు గనుము లే । కున్న లేదు.

హరి—సత్యకీర్తీ వీరినిప్పుడు సంగీతవిద్యాప్రౌఢి జూతము నామా.

సత్య—చిత్తమునాలాగె. మాతంగకన్యలారా! నొకగీతము బాడుడు.

మాత—మంచిది. (అని వీణెలు శ్రుతిజేసి పాడుచున్నారు)

గీతము.

వరాలకుప్పవురాజా । మహన్మైనరించుగుణతేజాభూజా॥ వరా।
మరుమశరములుబిరాన నేసెను।సరిగ జూచిసరిగమపదనిస।వరా।

1 నిన్నటిరాతిరినుంచి నీమీదనుయుండెనుమంచి । వన్నెలకాడ
వయూరిముక్తుల సన్నుతకార । సరిగమపదనిస॥ వరా।

2. వరనారాయణకవికి వరములునిచ్చెమహారుక్। తరుగేమున్నది
తకతకయున్నను చరాచరంబులు । సరిగమపదనిస। వరా॥

హరి—యీవనితలుబాడు గీతములో నాకేమి అర్థముకాలేదు సత్యకీర్తీ. అయినను వీరికంఠస్వరములు వీణాస్వరములకు మించి యున్నవి లయజ్ఞానమునకు సరస్వతులాన్నట్లున్నారు యీ ముత్యాలహారము వారికి బహూకరించుము.

సత్యకీర్తి యీమాలాంగకలను యిచ్చటనుండి కట్టవేయుచుండి.

సత్య—భద్రికా చూస్తావేమి.

భద్రి—కులటులారా యిక యిచ్చట నోరెత్తికున వెళ్ళుడు విూ వీపు బ్రద్దలవును.

మాత—హరిశ్చంద్రా మమ్ము నిట్లన్యాయముగా గొట్టించెదవుగా మానాన్నగారికి జెప్పి నీయుసురులు దీయించకున్న మాపేరు మారుబేరు బెట్టుము.

(అని బిగ్గరగా నేడ్చుచు బోవుచున్నారు)

విశ్వా—(తెరలో) ఆనురాత్ముడైయున హరిశ్చంద్రుడు మిమ్ముల కొట్టించి నెట్టించెనా యిక వాడుబడు పాటుజూచెదరు దుఃఖము విడిచెదరు ఊరడిల్లుడు ఊరడిల్లుడు.

చంద్ర—(ఉలికిపడి) ప్రాణపతీ. యేమీ ఆగ్రహనాలాపము విూకే రెత్తను చున్నాకే యెవరై యుండవచ్చును.

హరి—విశ్వామిత్రమహాఋషిలాగు నున్నది యీ వేళమనకేమి కారణముగా నున్నది. నా అవయవంగములన్ని గడగడ వణకు చున్నవి.

(హరిశ్చంద్రుడు చంద్రమతి తతిమ్మావారు అటుయిటు దిక్కులు జూచుచుందురు)

(విశ్వామిత్రుడు మారట రుద్రుడై) కీర్తన.

పొగరా యింతపొగరురా।

నాముద్దులనాబిడ్డల। నాలుకలుగోసెదంటివి ॥ పో ॥

1. అండలేనివారనియూ కండకొవ్వుమెండనియు। దండిరాచవాడనియు తిండిగల్గియున్నదనియు ॥ పో ॥

2. బ్రహ్మాండభాండములకు బ్రతిసృష్టి జేసితిరి బ్రహ్మనా యెదుట
    నిలచి బ్రతుకకను నిబ్రతుకెక్కడ । సా ॥
3. నారాయణరెడ్డినేలు నాగాభరణుడునైన । నా మాటకెక్కు
    రామేమ

హరి,చంద్ర—స్వామీ! విశ్వామిత్రా రక్షమాం రక్షమాం (అని సాష్టాంగముగ పాదములపై వ్రాలుదురు. (విశ్వామిత్రుడు) మోహాబమేలని కో(అని శిరమువన్ను నుకిరీటముక్రిందబడును.) సాగిరా యింతసాగరురా।

హరి—స్వామీ, నాకఠినశ్శిరస్సు స్వరిశవలన మీపాదము నొచ్చినదేమొ యిట్లిప్పుడు పిసికెదను.

విశ్వా—ఆ। మాననుతనములెల్ల ♦ మాయాభ్రమమునందు
        జెల్లవింక బొమ్ము ♦ చెనటిచెనటి
        యొనరమాటవారి— ♦ యిట్లు జెప్పుటలందు
        నితోనాటివారు ♦ నేడులేడు.

వేంగాలకు మాయామ్రాశ్రమమునందు మృగములే కనుపడిన నా! తిట్టికొట్టుచుటకు నాముద్గుల కొమరతలే నికుచులక నైరా! ఛీ, దురాత్మ నిముఖము జూచిన తప్పక పాపములు వచ్చును నిచక్కవిఘ్నకములిక్కడ యిక చాలింపుము నిపని యేమానో పూనుము.

చంద్ర—ఆర్యా,
    ఆ। తప్పుచేయువాని ♦ దండించుటకు నేమి
        తప్పుగలదుగాని ♦ దయనువినుము
        నికువిప్పనూడు। నేడుగడలెవరు
        తప్పుదిక్షమయ్య ♦ తగినశిక్ష.

విశ్వా——నిన్నెవరు బలుకరించిరి.

హరి——అయ్యా, నాతప్పులు క్షమించుము (అని పాదములపై బడును)

విశ్వా——(తనలో) ఏమీ, సతిపతులయొక్క ఔదార్యప్రౌఢిమ నే జేయు మాటలలో బయటబడ్డట్లుగా నున్నది పోని (ప్రకాశముగా)

కీర్తన.

తప్పులన్నిడి తప్పించెదనునా। చెప్పినకొలదిని జేయుదునా।
తప్పు లేకునా బిడ్డలకిప్పుడు। తరంగ్రాలుబోయెదమురా। తప్పు।
1 అల్లునికట్నము నడుగుదుమిచ్చెద। ఆకుబేరుని నవనిధులైనఁ గ
కల్లలేక నీకేమికావలెనో। కాదనకిచ్చెదనిపుడే। తప్పు॥
2 అదియుగాక నాకల్లుడవైనను। ముదమొందరే తుదమొదలుగ
గాంచగ
యిదెసమయముకల్యాణిరా। యిఁక బ్రాభిచంద్రహరిశ్చంద్ర। త।

హరి——మునివరా! మీరుగూడ యిట్లు సెలవిచ్చెదరే నేనేమి జెప్పుదును.

విశ్వా——యేమిజెప్పెదవు యిక చెప్పఁదేమియు లేదు.

హరి——స్వామీ! నారాజ్యమయిన నిచ్చెదనుగాని నేనిమాట విన జాలను.

విశ్వా——హరిశ్చంద్రా! నీకర్మ నిన్నుగట్టుకొని పోవుచుండ నిను చెప్పువార లెవరుగలరు యెవరైనయొకరు వినవద్దా కానిమ్ము.

హరి—— గీ॥ సకల రాజ్యసంపదలును ♦ సౌఖ్యమునుచు
విడచితిరి మరలనుదాని ♦ బడుదురె మిము
బోంట్లు యెరిగి హింసను వీడి ♦ పూర్తిగాను
మరలదానికిపుణ్యులు। మరలనట్లు.

విశ్వా— ఏమీ రాజా! నీమేలుకోరువ మెలుకువగలవారిలో కెల్ల నీవు మంచిమెలుకువగల వానివలె నున్నదె నీచేతగాని ఉపాయము లన్ని యిక్కడ చెల్లవు. నిపన్నమాట నీవు చెల్లించుకొనుము. చెల్లించుకొనవలేసినుము.

హరిశ్చం— స్వామీ! సంశయించ నేల.

సీ। ఎందరురాజులీ ◆ యిలను పాలించిరో
యికముందు నెందరు ◆ నేలగలరొ
ధనకనకాచిగ ◆ మనుటకు యీభూమి
రాలేదు యికముందు ◆ రాదురాదు
మనుజులకెల్లను ◆ మహిలోననిల్లుమా
పోవుటనిప్పుడు ◆ భూమినివిడచి
కనగనిగనుము ◆ కలలోనవచ్చిన
గతిమనయుటంచును ◆ స్థిరవిచార

గీ। తానిచ్చినమాటకునుంచక ◆ తిరుగమనుచు
నిశ్చయింపుముసత్యమ్ము ◆ నిందపడక
ధారవోసినవసుంధర ◆ తపసికిపుడు
మహితగుణరమో హరిశ్చంద్ర ◆ మాటతేంద్ర.

విశ్వా—(తనలో) హా హా! ఏమీయీపతివ్రతలలామముఁదారచరిత.

గీ। పతులకు సతులంగ నిట ◆ వంటివారు
గాని పతులకు నెవరాడి ◆ హానిజేసి
పలుకకుండినవారలు ◆ పాపజాతి
వసతులుగాని సుసతులు ◆ వారుగారు.

హరి— స్వామీ! ఆలస్యమొందులకు రాజ్యధారబట్టుడు.

విశ్వా—యిక నాయూలస్యమేమున్నది (అని దోయిలిబట్టును.)
హరి—చంద్రమతీ బంగారుకలశంబుతో దారజలమ్ముల విడచు
చుండుము.
చంద్ర—(భర్తయాజ్ఞప్రకారము చేయుచుండును)
హరి—గీ। కలమహీరాజ్యమంతయు ♦ కౌశికునకు
యిచ్చుచున్నాడ గాధేయ ♦ యికనుతప్ప
కుండనాయధికారమ్ము । కొలదినిప్పు
డేలుకొనుము మహారాజ ♦ యేలుకొనుము.
మునిరాజరాజ మహారాజరాజ యీకిరీటంబు ధరియించు
కొనుము. (అనియిచ్చును.)
విశ్వా—హరిశ్చంద్రా! నియౌదార్యమునకు మెచ్చితిని యిచ్చట
సత్యకీర్తిని మంత్రిత్వమునకు యుంచి నీ భార్యాపుత్రులతో
యీరాష్ట్రమునువిడచి యెటులకేని ఏగుము.
హరి— సత్యకీర్తీ! యీ మునిరాజు యాజ్ఞప్రకారము యిచ్చటనే
యుండుము.
సత్య— కీర్తన.
నిన్నువిడచియుండగలనా। నిముషమైనను
నన్నువిడచిపోవదగునా । నాలసింపక । నిన్ను ॥
1 చిన్నతనమునందునుండియు । కన్నతండ్రిపితుగ నుంటివి క్రి
మముదప్పక ॥ నిన్ను ॥
2. మునిరాజుకొప్పగించియు ।మునికోనిమీరంత నెటకో పోవు
చుండగ ॥ నిన్ను ॥
3. కారుణామేమెు తెలియును । నారాయణకవినిబోధించె నంది
వాహనుడిబు జేసె । నిన్ను ॥

హరి—సత్యకీర్తీ; కాలమొకరీతి గడుపవలయునను లోక విదిత మగు వాక్యము నీకు తెలుసునుగదా నేజెప్పవలదేమున్నది.

చంద్ర—నాయనా! సత్యకీర్తీ. నీవు దుఃఖించకుము శ్రీ మహా రాజగారు జెప్పినట్లు పెద్రిందుము.

సత్య—అమ్మా! మీరిట్లనే సెలవిచ్చెదరా, చిత్తము.

క। వందనములు గైకొనుడీవె
సుందరతనులారి సుజన సోదరులారా
అందంచు మనువిశోకుడీ
యుందేవిచ్చి యెడిగోల్కు యుకులులారా।

సూతు—అయ్యా, మాకు సెలవ. (యిరువురునిష్క్రమింతురు)

హరి—అలాగే. చ। హ। ఋషివరావందనములు మాకుసెలవ.

(పిమ్మట హరిశ్చంద్రుడు చంద్రమతులు పోవుచుండ)

విశ్వా—రాజదంపతులారా! రండీ, రండిటుభయులు మీరుదు మీకేల యీ ఆభరణములు రాజ్యమేలు దానికి కావలగా

చంద్ర,హరి—సరేచిత్తము.తీసుకొనండి(అనితీసియిచ్చుచున్నారు)

(మరిలా పోవుచున్నారు)

విశ్వా—ఒకేమరాత్మా? హరిశ్చంద్రా! పోకుపోకు.

కీర్తన.

హాహాహరిశ్చంద్రా అరిగెదవ అరిగెదవ। హాహా॥

1 యాగంబునకు దివ్యంబు యిస్తానని చెప్పి। ఆగంబులుభోగం
బులు త్యాగంబులుజేసి। హా॥

బలే నీసత్యమే చెప్పవలెను చెప్పినదాకా వస్తై.

చరణము—మాయమాటలను జెప్పి మా సొమ్మును నెగబెట్టి న్యా
యంబులు పైబెట్టి నమ్మకమునను సిగబట్టి। హా॥

హరిశ్చంద్రా నినాయక తాళనూలవా లేకతున్నామురా.

చరణము—ఏనుగునైన మనుజుని యెక్కగనివ్వనుమీరు । అం-తౌ
త్యద్రవ్యమును కలనా కిచ్చెదనంటివి । హరి ।

విశ్వా—గీ। అడుగకుండిన యొగబెట్టి ◆ నరుగువాడ
వుగద మాభాగ్యపిన్నన ◆ న్నెగను రాక
యిట్టియిచ్చకములుమ లే ◆ దేవినాకు
ముద్దుబిడ్డలపెండ్లికి ◆ మోడనాలర.

హరి—స్వామీ, రాజ్యమంతా నకేయిచ్చిగదా నిన్నప్పుడు చెప్పి యివ్వమనెదవు.

విశ్వా—యివ్వకుంటె నాబిడ్డలకు పెండ్లెట్లము.

హరి—యిందుల కేకదా! నీకు రాజ్యమిచ్చినది.

విశ్వా—యిన్నిటికి నాభాగ్యమెగనామముబెట్టితివేనా । గానితో నీరాజ్యముగూడ గభెళ్ళి.

చంద్ర—చచ్చినవార్కెడపుటన్యాయమువలె. పడిగయెత్తిన పాము నుగదా కొట్టవలసినది చచ్చినపామును కొట్టుదుగద.

విశ్వా—యిప్పుడేమనెదవు చంద్రమతీ నీవు.

హరి—చిత్తము అలాగే నొక్కమాసమురోజులు గడువుబెట్టుము.

విశ్వా—మొదటనే ఆయేడుపు యేడువరాదు.

హరి—అయ్యో, తెలియకపోయినది సెలవీను. (నిష్క్రమించుచుండు)

విశ్వా—హరిశ్చంద్రా! రమ్మురమ్ము. మీరుసంపాదించుద్రవ్యము మీక్రిందనె వ్రయమవుచుండును. భోజనముపట్ల వ్యవహారము పట్ల మోమాటము పనికిరాదు. మాశిష్యుని నక్షత్రకుని బంపిం

చెదను. మీవెంట మీరు సంపాదించు ద్రవ్యము ప్రతినిత్యము నక్షత్రకుని చేతికిచ్చుచు మీ ఋణము తేలికయగును. నక్షత్రకా యిట్లు రమ్ము.

నక్ష — పాఠము చదువుకుంటున్నానండి (అని చదువును) శంభురీశః పశుపతిః శివశ్శూలీ మహేశ్వరః ఈశ్వరశ్శర్వ ఈశానశ్శంకరశ్చంద్రశేఖరః। భూతేశః ఖండపరశుర్గిరీశో గిరిశో మృడః శంభు.

విశ్వా — శెబాసు శెబాసు యెరుగుదువే నక్షత్రకా రమ్ము.

నక్ష — (ప్రవేశించి తనలో) మా గురువుగారు మహారాజుని యెంత లోకువ బిక్షాలరాజుని జేసినారు. (ప్రకాశముగా) గురూత్తమా, నమస్కారము.

విశ్వా — (రహస్యముగ) నక్షత్రకా మనకు ఋణస్థుడైన హరిశ్చంద్రుని వెంటవెళ్ళి అనేకకష్టములు బెట్టి అబద్ధమాడించవలెనన్నమాట తెలిసినదా! (ప్రకాశముగా) శిష్యా! మనకు యివ్వవలసిన పైకము ఒకనెలకు గడువు బెట్టినాను యీతని వెంట నీవు వెళ్ళి యీ సొమ్ము గట్టుకొని రమ్ము పొమ్ము. (అని విశ్వామిత్రుడు పోవుచుండును.)

నక్ష — పంతులు గారూ! రండి.

విశ్వా — ఏమిటోయి?

నక్ష — నిన్న జెప్పిన నీతిశాస్త్రములో శ్లోకము నప్పగించుకొనుడు మళ్ళివచ్చేవరకు మరచిపోతాను.

విశ్వా — సరే ఒప్పజెప్పుము.

నక్ష — శ్లో। సత్యం మాతా పితా జ్ఞానం। ధర్మో భ్రాతా దయా సఖా
శాంతిః పత్నీ క్షమా పుత్రః। షడేతే మమ బాంధవాః

విశ్వా—సరే బాగా నేవచ్చి నిపోమ్ము. హరిశ్చంద్ర యిక నాలస్య మొందులకు.

హరి—చిత్తము (అని పోవుచుందరు)

విశ్వా—నక్షత్రకా! హరిశ్చంద్రుని యిట్లు పిమ్మనుము.

నక్ష—రాజా! మాగురువుగారు మిమ్ములను బిలుచుచున్నారు.
(హరిశ్చంద్రుడు మరల తిరిగివచ్చును.)

విశ్వా—హరిశ్చంద్రా! యింతవరకే కష్టములుబడెదవు సుఖముగా నాకోమార్తెలను పెండ్లియాడుము సకలభోగములననుభవించెదవు.

హరి—స్వామీ! యిక నా మాట సెలవబెట్టుకుడు.

విశ్వా—సరే హరిశ్చంద్ర మా శిష్యుని నక్షత్రకుని నీకోమరునితో పాటు జూచుకొనెదవ.

హరి—చిత్తము.

నక్ష—పంతులుగారు భక్తవశీకర శతకములో పద్యము నొక్క చెప్పుకొనుడు.

ఉ॥ త్రొక్కుడుబండి పైనురుకొ ♦ త్రొయ్యాలులాగ నిమాటలాడుటో
బక్కలబాధ పెట్టుటయొ ♦ బంధువులిండ్లకు తిండికర్గుటో
తిక్కకుచుట్టు త్రాగుటయొ ♦ ద్రిమ్మరులై యిలుయిల్లు దిర్గుటో
యొక్కువయుంచు మెచ్చరిది ♦ యేతలిదండ్రులు భక్తనిశ్వరా.

(అందరు నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము.



శ్రీరస్తు.

శ్రీ

# భజన సత్యహరిశ్చంద్రీయము.

## చతుర్థాంకము.

### రంగము—అరణ్యము.

(నక్షత్రకునితో హరిశ్చంద్రుడు చంద్రమతి లోహితాస్యులు ప్రవేశించుచున్నారు)

హరి—(సర్వేశ్వరుని) కీర్తన.

ఈశేశ జగముల కేశ। దారిజూపర మాకు దయతోడ నేడు। ఈ।

1 యేదారిజూచిన కోదారియెకాని। నీదరిజేరెను మునిఋణము దీరెను మీదివ్యతత్వాంతము మేలుగ వెలసెన। ఆదిదేవ కైలాసనివాస। లేదనక భక్తుల కేదియడిగిన నిచ్చుధాత। ఆదరణమది తోడమమ్మేలర నాలకించుము నాలకించుము॥ ఈశ।

2 నారాయణకవినిన్ను సన్నుతి భజించిన। యేరీతిబ్రోచితివో యిందుధరేశ్వర। రారామహేశ్వర రారాపరమేశ్వర। రారాత్రిజన వినుత రారానిశకరప్రభ। మీరునిజశుభగాత్ర మేమరు వేరు లేకను జూపిమమ్మేలు। క్రూరగుణముల జేరనీక। జేరదీయర జేరదీయర। ఈశ।

(ముందు హరిశ్చంద్రుడు తరువాత వారు నడుచుచున్నారు)

లోహి—నడువలేను నాకాళ్లు నొప్పులు బుట్టుచున్నవే నాన్నా నన్నెత్తుకొనవే.

చంద్ర—అయ్యో నేనెత్తుకొనజాల రారా మీనాన్నగారు తరువాత తీసుకుంటారు.

లోహి—నీవే నడువలేక కుంటుకుంటూ నడుస్తున్నావుగాని నన్నెందుకెత్తుకొనెదవు మానాన్నగారియొద్దకే పోయెదను.

హరి—(లోహితాస్యుని దగ్గరకుతీసుకొని ఎత్తుకొనును)

గీ॥ రాజరాజకొమరుడవై • రాల ముల్లు
నేలలందున నడువనీకు • నేలవారి
నొప్పికలుగమాకును ప్రాణము • నొచ్చుకుంకు
మెటులయిన కష్టములును ని • కేలతండ్రి!

(వెనుకకు తిరిగిచూచి) చంద్రమతీ పొత్తుగా నడువలేకుంటివేమి.

చంద్ర—(దుఃఖముతో) కీర్తన.

నడువజాల ఓ ప్రాణనాథ। నడు॥

1 అడుగులు తడబడుచుండెను కడకు చేతిబ్రేళ్ల రక్తము గారు
చుండె మీ యడుగులకు నమస్కారమయ్య॥ నడువా।
(అనికూలబడును) హా పరమేశ్వరా మాకు నేటికి యెంత
గతి సంభవింపజేస్తివి తండ్రి (అని కాళ్లువత్తుకొనుచుండును)

హరి—(చంకనున్న బాలునిదించి) చంద్రమతీ నాచేతి నూనుకొని తిన్నగా లెమ్ము. ఆకనుపడు కురువకవృక్షముక్రింద కూర్చొని కొంతవిశ్రాంతి తీర్చుకొందము నక్షత్రకుడనుగో

హరి—(దుఃఖముతో) కీర్తన.

ఏమిసేతు కాంతరో। యీకష్టదశకును। యేమేమి పాపములను
నెరుగక చేసితినో నేను॥ ఏమి॥

1 యెండకన్నెరుగనట్టి యీపసిబిడ్డగా। కొండరాలనడిపించు.

చూడ వలసివచ్చెను ॥ ఏమి ॥

2. గంగులనారాయణాఖ్యు నేలుచుండెడు। గంగాధరుడైనమనల గావకుండెను ॥ ఏమి ॥

చంద్ర — (తిన్నగా భర్తచేయూతకొని లేచును)

కీర్తన. ప్రాణనాథ నడువజాల । బ్రతుకదండము

హరి — ప్రాణసఖినడువుమింక । పయికిబోదము

లోహి — అమ్మగో నాకెండలకో । నాకలౌచున్నది

నక్ష — తమ్ముడ నిమ్మయున్నవాడె । దాహమవుచున్నది

చంద్ర. — ప్రాణనాథ నడువజాల । బ్రతుకదండము ।

(చంద్రమతి లోహితాస్యులు కురువకవృక్షముక్రింద కూర్చుండుదురు)

చంద్ర — నాథా! నక్షత్రకుడు చాలదూరముగానె యున్నాడె.

లోహి — నాన్నా, మనతోవచ్చిన బ్రాహ్మడు చేడె నడువనేలేడు.

హరి — నాయనా, యిదిగో పోయి తీసుకొనివచ్చెదను (పోవును.)

నక్ష — (హరిశ్చంద్రుని జూచి కపట ఆయాసదుఃఖములతో నేలపై బడును.)

హరి. — అయ్యా, తిన్నగనన్నానుకొని లెమ్మయ్యా, ఆచెట్టునీడకు వెళ్ళి కూర్చొని మనము కొంత విశ్రాంతిదీర్చుకొందము.

నక్ష — అయ్యా, చచ్చువానికింకెక్కడినీడ నేచచ్చిపోవుచున్నాను బాబూ మాగురువుగారికి వర్తమానముబంపు బాబూ నాకాళ్లు గుంజుకపోవుచున్నవి. నాచేతులు పట్టుకపోవుచున్నవి నాకను లు లోనికి బోవుచున్నవి నానాలుక యెండుకపోవుచున్నది నే జీవించునట్లు నీభార్యను నీకొమరుని తీసుకవెళ్ళి చెట్టుక్రింద కూర్చుండబెట్టితివిగా యేపెద్దపులి నోట్లోనో యేచిర్తపులి నో

టిలోనో యిదెవరికే పడిపోయ్యె వాడను.

హరి—నక్షత్రికా నీకింత భయమెందులకు.

నక్ష—యిదిగో మేము విప్రులమని చెప్పుల మీదాదంటి రాజుల్ని బిచ్చాలరాజుల్ని చెయ్యాలంటె కాసేపులో చేశేస్తాం తొందర పిల్లబాగా నోరుదెరసిన దండు ఉరుకుతాం యిక నీవు పరిహాసముచేయుట ఉచితముకాదు.

హరి—తిన్నగాలెమ్మా (అని లేవదీయును) చెట్టుక్రిందకు తీసుకొని వచ్చి కూర్చుండబెట్టును.

నక్ష—అన్నినీళ్ళుగాన్నై బ్రతుకుతానయ్యా (అని చెయిజూపించును)

లోహి—నాన్నా నాకాకలిని మంచినీళ్ళు.

హరి—నాయనా, యీ అగ్రదేశములో యెచ్చటనైన యున్నవేమో చూచి తీసుకొనివచ్చెదను. చంద్రమతీ పిల్లకు ధైర్యము చెప్పుచుండుము. (అని పోవును)

నక్ష—అమ్మా యింకారాలేదు మంచినీళ్ళు తీసుకొని నే వచ్చెనో యినా నేమో చూడమ్మా.

చంద్ర—నాయనా, యిప్పుడేకా వెళ్ళింది యెడమేది.

లోహి—అమ్మా, నాకొక్క రివ్వ అన్నముపెట్టవె మానాన్న వచ్చేవరకు.

చంద్ర—(దుఃఖముతో) కీర్తన.

ఓపార్వతీశ యేలబ్రోవవుమమ్మల । ఓపా ॥

1. కాపురమంతబోయి కానలపాలయితిమి । యేపాప మెవ్వరికి జేసితిమి ॥ ఓపా ॥

2. కుశికనందనునిఋణము శశిధరతీరుటెట్లు । దశబోయి దశకు వసిమి ॥ ఓపా ॥

3. ఆకలిదప్పులచే ఆహాయని యీవిఠ్ఠల్ । శోకము జేయు చుండిరి । ఓహో ।

4 నారాయణరెడ్డి నెపుడు మారనక గ్రోచిన । సూరిజనవినుత మోహా ॥ ఓహో ॥

(అపుడు నాలుగు కల్పవృక్షఫలములు బడును)

లోహి — (ఆతురతతో) అమ్మా యివిగో తియ్యనిపండులు.

చంద్ర — బిడ్డా మనకు దేవుడు పంపించిన భోజనమిదియె నీవొక కటి భుజింపుము నక్షత్రకునకు నొకటియిమ్ము.

లోహి — అయ్యా, యీఫలములను తీసుకొని భుజింపుము(అని యిచ్చును)

సతి — హాహా యేమీ ఆశ్చర్యము యీమహాపతివ్రతయొక్క సత్యము మాచినరుగూడ కనుపడుచున్నదే.

చంద్ర — అమ్మలారా! ఆకినపడు కొలనకు వెళ్ళి మంచి నీరు త్రావిరండి.

సతి — (సమితో వినచ్చి) అమ్మా మమ్మును బ్రతికించితిరి నేడిచ్చ టనుండకున్నచో మమ్ము బ్రతుకనిగద. మమ్ము లేకుండ మా బాబు అసలేప్రాణవాడుగా యెంతపుణ్యాత్మురాలవమ్మా నీవు ఫలాహారము చేసినావుగా.

చంద్ర — నాపతిభుజించిన తరువాత.

సతి — యెంత వెఱ్ఱిబాగులదానవమ్మా యిటువంటివారేన పతులు.

సీ॥ పూటకొకసన్యాసి ♦ కోడి రాజ్యమునంత
పాడుజేయునతండు ♦ పతియనీకు
వినవమ్మ చెప్పెద । పెనుకష్టములు దెచ్చి
పడుమని యొనితండు ♦ పతియనీకు

కూడుగుడ్డకునైన ♦ నేమ లేకనుయుండి
గతిమాలినితండు ♦ పతియనీకు
మునికిఋణమువడి ♦ మునిగిపోవుచునుండె
బలము లేకనితండు ♦ పతియనీకు
గీ॥ ఏలయీగోలనీకిక ♦ చాలవినుము
మాగురుండిగి సకలసా♦ మ్రాజ్యపదవి
వచ్చునట్టుల జేసెద ♦ పిచ్చితల్లి
తెండుసుతునును నీవును ♦ తెండుతెండు.

చంద్ర—నక్షత్రకా! ఏమీ నీ నీతివాక్యములువినుము.

సీ॥ ధరణిలోనిజమైన ♦ తరుణికైనకైన
పతియె దైవంబాచు ♦ బల్కుచుండు
గుడ్డికునిష్టుడై ♦ కోపమెచ్చుగనున్న
పతియె దైవంబాచు ♦ బల్కుచుండు
కుంటివకట్టను లేక ♦ గోరాడుచుండిన
పతియె దైవంబాచు ♦ బల్కుచుండు
పలుకష్టములుబెట్టి ♦ బాధించుచుండిన
పతియె దైవంబాచు ♦ బల్కుచుండు
ఆ॥ తెలియకిట్టినీవు ♦ పలికినఫలమేమి
లేను చూడుమింక ♦ లేచుచూడు
పలుకవలదునీకు ♦ ఫలమేమి ఫలమేమి
పలుకవలదునీకు ♦ బ్రహ్మచారి.

నక్ష—నేను చెప్పినప్రయోజనములేదని చెప్పకమునుపే ననుకొంటిని యిక నీవు వినుటమాత్రము మొదులకు సంభవించును (తనలో) మాగురువుగారి పని తరుగులేక నెరవేర్చుకుందును.

విశ్వా—(ఎవ్వరికి గనుపడకుండ) నక్షత్రకా! నీవు మంచిపని జేయు చుంటివి. వీరికి ఆహారమెట్లు లభించెనో నే జేయుమాయ. నేను నెయ్యరో యింద్రి ఫలముల వేసెనా! నా సంగతి తెలియును గాబోలు మంచితివా. (కోపముతో నాకసమువంక జూచి) ఇగాదా! నే, దురాత్మా నా శాపజలముల విడచితినా, గాలికి నగుడాకు లేచిపోయినట్లు స్వర్గము విడిచిపోయెదవు. గౌతముని శాపము వలెననుకొంటివ (ఆలోచించి) యీమె పతివ్రతా మహాత్మ్యమునకు మెచ్చి ప్రకృతియే సహాయము జేయవచ్చును. యింద్రుడు జేసిన పని కాదు కాక పోవచ్చును యిప్పుడుదకము లనుగొని యీ హరిశ్చంద్రునితో జెప్పి ఫలాపేక్షమునకు వీరిని చెప్పుమని పతివక్తునకు ప్రోత్సాహించితి. వస్తునే యున్నాడు హరిశ్చంద్రుడు వినోదము జూచెద.

హరి—గీ॥ సకలజనులకు తేలిక ♦ సముద్రమునకు
దొరికి దేనియు నెలికన ♦ దుఃఖమునకు
కారణము బీదతనము నే ♦ కష్టమైన
పడగవచ్చునుగాని బీ ♦ దపడగరాదు.

(నిట్టూర్పుతో) కటకటా యిటువంటి దారిద్ర్యమునకు నేనే పాత్రుడనైతి.

చంద్ర—స్వామీ, యీ ఫలములను భుజింపుడు అవిగో మంచినీరు త్రాగుడు. నక్షత్రకుడు లోహితాస్యుడు సుఖముగా నుండిరి.

హరి—యీ ఫలములనారగించి ఆకలిగొనిన తత్క్షణమే శరీరాయాసములు తగ్గి బలము వచ్చెను. యీ ఫలము లెట్లు లభించెను.

లోహి—నాకోష్టమమ్మ.

కీర్తన॥ చరణము॥ నారాయణ రక్షింపుము । మారజనకబ్రోచిర ।
సూరిజనవినుత మోహాన॥ ఓహో॥

అనేవరకు పైనుండి వ్రాలినవె.

సత్య—కాదుకాదు. మాయమ్మ చేసుకున్న పుణ్యమువలన వచ్చినవి

హరి—సరేమంచిది. యిచ్చటకు దాపులో నొకవటవృక్షమున్నది. మీరు రాత్రి శయనించుటకు వసతిగానుండును అచ్చటకు చేరుడని నొక మునీశ్వరుడు చెప్పెను పోదము లెండు.

(లోహితాస్యుని చంద్రమతి యెత్తుకొనును, నక్షత్రకుని హరిశ్చంద్రుడు తీసుకొనును)

చంద్ర— కీర్తన.

ఎంతదూరమొ యిటకునున్నావట । ఇంకెంతదూరమొ నాథ సంతోషంబుననడచుదమన్న । సాగిరావు నాయడుగులు నేను । ఏమిసేతు ఎట్లునడతు స్వామినాథ ॥ ఎంత ॥

హరి—యింతిరో గనుము యీకనుమ మావల ॥ ఎంతదూరమొ లేదు ॥ అంతరంగమున నాహరుదలచుచు నరుగుము మెల్లగ నదిగో వృక్షము । కనుగొనుము కనుగొనల కనుపడుగ ॥ యింతి ॥

చంద్ర—శ్రీహరి బాడెను. యుండెపయాతుల శ్రితజన కల్పము నదియేన॥

హరి—ఔనౌను దానియాకుల ఆహారియుండును జూడగను.

చంద్ర—సరేసరే మంచిది పదపద.

హరి—బిరబిరనడువుము నడువుము.

చంద్ర—వస్తి.

హరి—రమ్ము.

చంద్రి—అ.
హరి—అ-యుంశి.

(కొంచెము మూడు నకు నడచి అందరు శయనింతురు)

నక్ష—యీచెట్టుక్రింది పరుండిననుంచి నాకేమో భయముగలుగు చున్నది. మీ సతీపతులిద్దరు చెరియొకదరినగూర్చొని ధైర్యము జెప్పి నిద్రవచ్చునటుల జేయవలెనది. మనము బయలుదేరిన నుంచినిద్రలేదు ఆహారమంతె నేజీవించుటకష్టముమీయిష్టము.

చంద్ర—హరి— జోలపాట.

జో గాధిసుతశిష్య। జో బ్రాహ్మణయ్య। జో సుజన నక్షత్రి జో అప్పులయ్య। జో।

నక్ష—లేకూ। జో అప్పులయ్య అనగా రెండుదినాలు బాకీదారు డెనయ్య యిప్పుడు గోతివేలయ్య అని అర్థమా.

హరి—కాదుకాదు నక్షత్రకా! మామీద బాకీవసూలు జేయవస్తివి గాబట్టి అప్పులయ్యా అంటిమి.

నక్ష—సరే ఆయర్థము కాదుగద వచ్చేటప్పుడు మమ్మ కైనా చెప్పి రాలేదు. (అని మరలపరుండును)

2 చరణము—ఆవులమందలో ఆటాడితయ్య। కావుకావు మంచు కిలకిలనకయ్య। జో।

3 అటుయేడుయిటుయేడు సముద్రములుగలియ। వటపత్రశాయి వై పవళించవయ్య॥ జో॥

4 మూనాళ్లముచ్చటిది మునిగిపోతయ్య। రాముపోనుగాన లేని చుట్టమయ్య॥ జో।

5 నారాయణాఖ్యుని సారెకును బ్రోచి। దారిజూపెడుపూలి దయ

నగసుమనస్య ॥ జో ॥

చంద్ర—నాథా! నక్షత్రకుడు నిద్రించినాడు.

హరి—అబలా లోహితాస్యునిపై చెయివేసి నిద్రకూడానట్లు నద్దె గిల్లుము.

చంద్ర—చిత్తము. (ఆప్రకారమె చేయుచుండును)

హరి—(కూర్చొని) అకటా ఏమీ యీ కాలమహిమ మణిదీప ములకాంతి ప్రజ్వరిల్ల మెత్తనిపరుపులపై బరుండి హంసగమనలు వింజామరలు వీచుచుండ నిద్రించు యీబాలునికి యెంత కష్టమువచ్చెను. సరే పుట్టినదిమొదలుకొని యెన్నడు కష్టమును నది యెరుగని యీయబలను చంద్రమతిని.

గీ॥ హంసతూలికశయ్యపై ♦ నలరుచుండు
ఆరురుచులందు తరుగులే ♦ నారగించు
యోషవారములంగలు ♦ నేడులేక
కటికినేలపయి బరుండె ♦ గానుజేసె.

గాన యీకాలముగడచుట కెవనితరముగాదు.

(తెరలో కలకలారావము)

హరి—(తిరిగిచూచి) గాలియైన వీచలేదె.

(భేతాళుడు తన సపరివారముతో ప్రవేశించుచున్నాడు.)

భేతా—ఆ॥ లావులావువారు ♦ రారునాచెట్టుకు
నీవునెవరవోరి ♦ నెతివిడచి
వచ్చిచేరినావు ♦ వదలకనిద్దుబట్టి
భక్షణమునుజేతు ♦ పారిపోకు.

పరిజనము—అరే చిన్నోడా పీనికండలు బాగుంటాయి కొట్టుకు చావగొట్టుడు.

హారి—(తనలో) వీరికి నిద్రాభంగము గలుగకుండ నేనే వారిని సమీపించి చంపెదను. (సమీపించును.)

కీర్తన.

ఒకేఒకే నినెవడిప్పురా పరాకుమాటలు బిరాననాక్షివి దరంబులోనిది బిరానజంపి చరాకుజూపెద మొరాల కించను దురాత్మ। ఒకే॥

ఫేతా—ఒకేఒకే నినెవడిప్పురా బిరానయుష్మలపరాతలంబున। నరాధమ నన్నాడే బ్రతుకు గారె। కరకరదించును పరపరదించును గాచుకోనినిన్నుబ్బకు గాకె। (అని హైకెరుముకును)

హారి—(బిట్టుబిట్టు నావలకు పిప్పుకొనిపోవును)

ఫేతా—చచ్చితిచచ్చితి (అని కేకవేయును) (పరిజనులంత బెదరి ఉరుకుదురు)

నక్ష—(గిజగిజలతన్నుకొని లేచి) చంద్రమతీ లోహితాస్య లెండు లెండు. పిమ్మాలు నన్ను తింటున్నవి భూతాలవిగో.

చంద్ర—(భయముతో లేచి) నాపతియెచ్చట నాపతియెచ్చట.

హారి—(తనలో) వచ్చితి పాంథులవిశ్రాంతి భంగకారకుడైన భూతాధిముని జంపి వచ్చితి.

చంద్ర—నక్షత్రకా! యిక మరొకపాయము లేదు. రాజుగారు ఫేతాళుని జంపివచ్చుచున్నారు.

విశ్వా—(నక్షత్రకుని చేసైగచే నావలకు బిలచి) నక్షత్రకా! వీరినిక్కడనుంచి ప్రయాణము సాగింపుము నాశక్తినంత ధారవోసి చూచెద.

నక్ష—అలాగే.

హరి—(వచ్చి) మీకేమి భయముగలుగ లేదుగద.

నక్ష—భయమేమున్నది. యిచ్చట నే నిమిషముండినను బ్రాహ్మ
ణమాంసము దయ్యాలకు రుచియట మమ్మా చిన్నతనములో
జెప్పెడి ప్రయాణము గట్టాలసినదే.

హరి—సరే చీకటిగా యున్నదండి.

నక్ష—సరేనని ఆలస్యముజేయగాకండి చీకటుమిజేయును అదిగో
దయ్యము యెట్టగా గుర్లురుముతున్నది.

హరి—అది దయ్యముకాదు రాత్రి సంచరించి మేతాడుమృగము
బుర్వ మీరు బ్రహ్మవేత్తలె మీకెందులకండి యింతభయము
ప్రాణముపై.

నక్ష—సరేసరే, సభలయందు పుస్తకములందు బ్రహ్మ వేత్తలము
బ్రహ్మజ్ఞానులము గాని యిటువంటి సమయమున గూడానా ?
ఏమీరాజా! నీపరిహాసపుమాట యెన్నిసార్లైన నా పిరికితన
మె నన్ను రక్షించుచున్న దింతవరకు.

హరి—నక్షత్రకా! బయలుదేరుము.

నక్ష—నీవేముందు.

(అందరు నడచుచున్నారు.)

చంద్ర—నాథా! మనకు యిరుప్రక్కల వెలుతురగుపడుచున్నదేల

నక్ష—కొరవిదయ్యాలేమొ బాబాయ యింకేమున్నది.

హరి—కాదుకాదు.దావాగ్ని అరణ్యముదహించుచు వచ్చుచున్నది

చంద్ర—స్వామీ, యీదావాగ్ని చుట్టుకొని వచ్చుచున్నది ముని
ఋణము దీరుటెట్లు దీని కాహుతి నన్ను జేసి మిమ్ములను రక్షించ
మనివేడెద.

లోహి— కీర్తన.

తల్లియేల నే ఆతగులఁబడెదు చోటికిఁబోవ । తల్లి ॥

1 కల్లగాదు నాగుండెలు ఝల్లుమనుచున్నవి । చల్లగాను మళ్ల
రాక । తల్లడించెదవు నీవు ॥ తల్లి ॥

2 యింటికేగి సుఖము వడెదమా । యీయడవులందు దిరిగెదమా
అంటి అంటరాని నిష్ఠ లంటి బ్రతుకవచ్చునె । మాటలవిగో
యింటికేగసె । యింటికేగుదాము హొంమస్తాని ముఖారితో ॥ త ॥

చంద్ర— తండ్రీ! నా వెంటరాకుము మీ తండ్రియొద్దనే నిలువుము.

(లోహితాస్యుఁడు తండ్రిదగ్గర నిలువబడియుండును)

చంద్ర— (కరపుటాంజలియై దావాగ్ని కెదురుగ నడచి)

దండకము— శ్రీ అగ్నిదేవా మముం బ్రోవలేవా జగంబంతనీవా పరాకేల నీకేమి పాపంబు మేమెప్పుడున్ జేయలేదే దయన్ దప్పి యీ వేడి రూపంబుతో వచ్చి మామీద రౌద్రంబు జూపింతువే రక్షపాత్రంబు లేదంచు నేనీకు నిస్సేవ జేయంగ లేదని యాగంబులన్ జాతవేదాది నామంబులన్ బిల్చి నామాట జెప్పంగ రాదేమి ముంజూడనోపంగ లేరైరి దేవాను లేమున్న మేమెంతవారమ్ యిదే నీకు దాసోహమంచున్న చాలింపు చాలింపు నీ యుగ్ర తేజమ్ము తండ్రీ మహాత్మ్యాన లేకున్న గాధేయునప్పట్లు దీక్షేమ నీకన్న దైవంబు వేరెవ్వరయ్యా నన్ గాల్చి పాడేయు మయ్యా నిన్ నమ్మి యున్నార మయ్యా నమస్తే నమస్తే.

(అని కన్నులు మూసుకొనును దావాగ్ని చల్లారును. మరలి వచ్చును)

హరి— దేవీ నీమహాత్మ్యము చేతనేగదా మేమందరమును జీవించుట
గల్గినది.

చంద్ర—ప్రాణేశ్వరా! మీసత్యవ్రతప్రవర్తనఫల విషయమేగాని నా విషయమే మాత్రమునుగాను యీదావాగ్ని జల్లారుట మీదయ.

సత్య—అమ్మా యికనైన ప్రయాణము సాగనివ్వడి మీ పొగత్తిల కేమివచ్చులే మా భాకదీరి బైటబడినట్లు దయ్యాలచెట్లు దాటితిమి. తొందరతొందర. (కొంతవడి నడుచుచున్నారు)

హరి—(ఆలించి) ప్రాణేశ్వరీ వినుము అదిగో గంగానది యొక్క- తరంగశబ్దములు ఆకనుపడు శిఖరమే శ్రీ విశ్వేశ్వరస్వాముల వారి ఆలయశిఖరము గనుము.

చంద్ర—స్వామీ, శ్రీస్వామివారి ఆలయశిఖర దర్శనమైనది గాన శ్రీవారిని ప్రార్థించి ప్రయాణము సాగించెదము.

సత్య—(తనలో) మరల ఏరాలస్యము జేయుచున్నారే అయినను తెల్లవారినదిలే దయ్యాలికరావు నేనుగూడా స్వామిని ప్రార్థించుకొనెదను.

హరి—అటులనే చేయుదము.

స॥ లో॥ చ॥ హ॥ (వరుస)

కీర్తన.

కాశీనాథ కరుణజూడు గౌరీనాథ ॥

1. ఆశరహిత నిన్నాశించితి పర । మేశ జగదీశ సుప్రకాశ దేశిక నాథ ॥ కాశీ ॥

2. నందివాహన నాగాభరణ । వందితసుగుణ వందనమిదెర ॥ కా ॥

3. నారాయణకవినమ్మినపరశివ । భారముమాన్పరభక్తమందార ॥ కా ॥

(అందరు నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.



చ—హా— పూజనాలు.

పూజలు చేతాము భూతినాథునికపుడు

నానాపుష్పావళిని మాలాస్రగా జేసి । తేజములుంగ సన్నజాజి
క్రొమ్మల్లెలతోడ ॥ పూజలు ।

1. విశ్వనాథుడునై వెలసెనునిచ్చట । శివశక్త్యాళితో ఉమాజమ
శంకర । పూజలు ।

2 నారాయణుకివి కోరినవరములు । నారదునాసనా । నాగుణా
పురుషుడు ॥ పూజలు చేతాము భూతనాథునికిపుడు । పూ ।

(మరల నమస్కరించుచున్నారు)

విశ్వా—(వచ్చి తొంగితొంగి చూచుచు) ఓ నక్షత్రకా! (అని చే
సైగజేసి) యేమిరా! నారింగో నవ్వుగూడికలసి నా నొక మొత్తె
మొగబెట్టి పిలచితివి అ. అ.

నక్ష—(తొందరబొందరలతో) స్వామిస్వామి యిప్పుడే విశ్వనాథుని
పూజ జేయుచున్నా ఆ. ఆ.

విశ్వా—యికనాలస్యము జేయకు నక్షత్రకా! నత్తిడి జేయుము
బాకి యివ్వమని నిలవేయుము.

నక్ష—చిత్తము.

విశ్వా—తెలిసినదా! నేను పోవుచున్నాను. (పోవును)

నక్ష—రండిరండి మాగురువుగారి పూజకురండి.

(విభూతిపండ్లు శంఖములు దీసుకొని వీరలింగం శంభులింగం గంట
లువాయించుచుండును) కీర్తన.

నేను ఒక్కటిజూచితన్న అది జెప్పనేల। నీవు నేనెవరో తెలియవస్తె

1. జ్ఞానమార్గములు దెలిసినవారికి। లేనిదిరామే మొ తెలుసుకొవస్తె।

నాంగుగులిపెంటలుబండి వచ్చురుమనకిక సకలధాన్యములు । నే॥

2. ఓనమఃశివాయనునమ్మ ఉన్నాడుశివుడు। ఓనమఃశివాయనరన్న
దానధర్మములు జేసినవారికి దానిసంగతులు దెలుసునో
యమ్మ వానలుగురుసును పంటలుబండును వచ్చురుమన
కిక సకలధాన్యములు । నేను ।

(వీరలింగం శంభులింగం ప్రవేశించి)

వీర.—ఒరే శంభులింగం నేను ప్రొద్దున గంగానదిలో స్నానముజేసి
వచ్చుచుండ నేను బాటలో యెదురుపడితి. ముందరగాయున్న
బ్రాహ్మణాచార్యవిశ్వనాథునిఅయ్యముకురమ్మనమని చెప్పినాడు

శంభు—ఒరే వీరలింగం నాతో జెప్పలేదేమిర.

వీర—యిప్పుడాయన ముఖముజూచి జ్ఞాపకమువచ్చిందిరా.

వీ—శ—(సత్రకుని కేకవేరుగాగోయి) మహాప్రభో ధర్మం జేసుకోండి
అయ్యా! ప్రొద్దున మీ రేకడ రమ్మనమని చెప్పినది.

సత్ర—నేను (అని ఒకకాసి ఉంపగి చెరుగున దానినివిప్పి) మాగు
రువుగారు నీకివేంట అప్పు నసూలు జెయ్యడానికి పంపిస్తు యీ
కాసి దగ్గరనుంచుకోమని యిచ్చినారు యిది మీకు ధర్మము
గానుదేసునాను పట్టుడు మేము నారు ఒకటు.

వీ—శ—మహాప్రభో అంతేచాలు మీకొండుకులు కోటింద్రు చల్లగ
వర్ధిల్లవలె. మీయింటిపొట్ట నెయ్యిండ్లుగావలె మహారాజ హర
హరశంభో మహాదేవ.

వీర—శం— కీర్తన.

ఏమిరలింగ పల్కవుపల్కవు । కామితార్థము లివ్వరమాకు.

(యిరువురు నిష్క్రమింతురు)

"నక్షత్రకుడు"

గీ॥ ఇవ్వవలసిన నిచ్చును ♦ ఇవ్వకున్న
పూజ జేసిన ఫలమేమి ♦ పుణ్యులార
చేయు పాపంబు లెంతైన ♦ జేర్చి మూట
పోవునే యెంత కాశికి ♦ బోవుననగ.

హరి—నక్షత్రకా! మీ ఋణము ఇవ్వక పోదునా.

నక్ష—గీ॥ అప్పనివ్వట్లు దీర్చెదా ♦ అన్నమునకె
లేక నల్లాడబెడితివి ♦ మాకునిచ్చు
గట్టిగాయనపత్రాల ♦ గలవనాటి
లెవరయిన నిడ మూర్ఖాన్న ♦ మోసకపుడు.

హరిశ్చంద్రా! నీవు లేదనినను మోసమేమియు లేదు.

హరి—నక్షత్రకా! సాక్షులు పత్రములు గావలయునా నిజము నకు నిష్ఠూరముగా మాట్లాడెదవు.

నక్ష—సరే యివ్వము కోడలు మగనింట్లోనాని గంధారి లేదు అన్నా వద్దనునా? నిజము మాట్లాడితే నిష్ఠూరముల అనిపించుకవినితివా. యీమాసము రోజులనుంచి అన్నము లేక పైకము నిల్లు లేక యింటికి నబట్టలు లేక నాయబెట్టె మాయబెట్టితివి నిద్ర లేక కండ్లుమంట లెత్తుకొని పోవుచున్నవి. అంతపుణ్యాము బుడితే యింకేమి.

హరి—మీ బాకీ యివ్వనని యా మీ యభిప్రాయము.

నక్ష—అవును.

సీ॥ యితర రాజులనడిగి ♦ చ్చెదమన్నను
పరమదరిద్రత ♦ న్నావలివరు
చదువు శాస్త్రములను ♦ చదివి తెచ్చెదమన్న
నీచము వెవ్వరు ♦ నిజము వినరు

వ్యాపారములు జేసి ♦ యయిన బూతమటన్న
ఫలముని చ్చెడువారు ♦ ధరణి నెవరు
భూసారు బడిమీద ♦ బొర్లించెదమటన్న
బెత్తెడు భూమైన ♦ విత్తనివరు
గీ। గడువు రేపటితోడనె ♦ గడచిపోవు
యిచ్చితేగాని ఋణమును ♦ హెచ్చుగాదు
కోసితేగాని గణమును ♦ కుదురబోదు
నాటమాత్రాన నేనైన ♦ మానబోదు.

హరిశ్చంద్రా! ఒక ఉపాయంబు జెప్పెద వినుము లోకసత్వము
పొల్లు వాకు కొమ్ము యిప్పుము నాదారి నేను బోయెదను
గురునకు సమాధానము జెప్పెదను యేల కాలహరణము.

కీర్తన.

కాలహరణ మేల కాదనక లేదనక । కాలహరణ మేల॥
చాలుచాలునిమాను చాలగ దెలసిపోయె । నాలిబెట్టెద వేల
తాలనాపెడ పో పో ॥ కాల ॥

హరి—విప్రవర్య వినుము వేరనకమారనక విప్రవర్య వినుము
యిచ్చెదనన్నవరకు యిచ్చెద చచ్చెద । హెచ్చుమాటలేల
యిచ్చువచ్చినట్లు ॥ విప్ర ॥

నక్ష—ప్రొద్దుగుంకువరకు జెప్పిన । ప్రొద్దుబోవుమాటయె కాని
పద్దు జెల్లెమాట జెప్పవు । సుద్దులనుకొంటివా ॥ కాల॥

హరి.—రాజాధిరాజులయిన రారాజులైగాని । రాముడెట్టింతవారికి
రక్షకుడు రక్ష లేనిది ॥ విప్ర ॥

నక్ష—మెట్టవేదాంతమేల మేలేమిమేలేమి । కట్టు నా బాకినంత

కనులు మెచ్చఁటనుండి ॥ కాల ॥ (చెయిబట్టి నిలవేయును)

హరి—చరణము। ఆడితప్పి పలికినాంక నాకంఠముగ త్రెంచిన।
నేడేని బాకిగట్టిన నాఁడే నా చెయివిడుపును ॥ విప్ర ॥

నక్ష—(చేతినివిడచి) హరిశ్చంద్రా! కపటవిద్యంబు ప్రాప్తించిన గర్వ
మణఁగలేదె.

హరి—యిప్పుడన్నది గూడ గర్వమేనా!

నక్ష—అయితే నేను యివ్వమన్నది పొరపాటు.

హరి—కాదు కాదు అదియుగాదు యిదియుగాదు.

నక్ష—యిదియుగాదనఁగా మాఅప్పుగూడగాదా.

చంద్ర— కీర్తన.

యింతకఠినపుమాటల యిప్పుడు తగునయ్య నక్షత్రయ్య ॥

1. యెంతచిక్కులు బెట్టిన నాపతి। సుంతసత్యము విడువఁడు వినుము
గనుము పంతములాడకు నిబాకేము। అంతరంగమున నుం
చియుండుము సంతోషంబున దొరికినప్పుడు। కొంతయు యిక
తరుగుంచెదమూ యెంచెదము ॥ యింత ॥

2. మంచిమాటజెప్పినను నీవు నెబ్బరొచుచుంటెను మించబోకు
మీయాజ్ఞకు సంచితమెటులుంచునో సజరుగుగాని యెం
చిచూచిన మించునె యుంచకుని క్రోధంబును మనసులో
పెంచినదానితో వంచనగల్గును పుంచుము మామీదను
దయ పెంచుము ॥ యింత ॥

నక్ష—చంద్రమతీ నీవు పెనిమిటికి తగ్గదానివె. గట్టిగా బాకియుండి
గిన నావి కఠినపుమాటలా! హరిశ్చంద్రా! యిక నేనుండుటకు
వీలులేదు మాగురువుగారు యాజ్ఞప్రకారము వెళ్లుచున్నాను.

ఉందని చెప్పఁ లేకున్న లేదనిచెప్పను యిక నే బాకి యుండగను.

హరి—గీ॥ ప్రాణమమూర్ఖుఁడగుటచే ♦ పడుకొనిన
నిద్రరాదు పరాజయము ♦ కనఁగలేక
అనుదినము పెనుదిగులు గ ♦ యమునశించు
ఒకవికఋణబాధ వలన ♦ నికనుభువిలో.

శ్రీమసఖి. యీఋణబాధకన్నను చచ్చినదేమేలుగా కనుపడుచున్నది. యీఋణము దీర్చక చచ్చిపోయిన వచ్చుజన్మములో కుక్కలయి తీర్చవలెనని ఆర్యులు వక్కాణించుచున్నారు. ముందుకు బోతె భావి. వెనుకకువస్తె చెఱువు.

చంద్ర—నాథా! నామాటవి.

గీ॥ మనుజవరులును మునుమును ♦ మంచిదనగ
సత్యమేజనమనుటకు ♦ సాక్షమనగ
గాధిసుతుని ఋణముకు ♦ గానగ
కీర్తిదాసిగనమ్ముము ♦ తిరుగ కనగ.

హరి—(మూర్ఛతేచి)

సీ॥ అలనాడు రాజసూ ♦ యజ్ఞంబులందున
ప్రక్కతోడుగనున్న ♦ పడతియెవరు
యశ్వమేధములందు ♦ నలసటజెందక
బంతులుజాగించు ♦ పడతియెవరు
నిన్నగాకనుమొన్న ♦ నన్నుదిన్ననగాధి
పట్టినోడించిన ♦ పడతియెవరు
యీవేళదావాగ్ని ♦ యిరుప్రక్కలనురాగ
ప్రణతితో నార్పిన ♦ పడతియెవరు

గీ॥ యిష్టమున జెయుబోకిష్టగా ♦ యేమిటని
పౌర్ణవాక్యములాడిన ♦ పాతిమొనరు
యట్టినిందాసిగానమ్మి ♦ ననురకుండ
పరిబల శ్రీహరిశ్చంద్రనృపుడు ♦ బ్రతుక నెనరు.

చంద్ర—నాథా! నన్నింతగా పొగడనేల.

గీ॥ ఆపదలకు కష్టపడిన ♦ దాలి నూలి
యూజ్ఞభక్తికుమిూంచి ♦ దాలినూలి
అంతమీాయిష్టమునినవె ♦ చూలినూలి
నావినను నమ్ముకొనుటకు ♦ యేమిటాలి.

సత్య—పెండ్లాముని అమ్ముకొనుటం మంచిదా, లేదు అని రెండక్షర ములబల్కుట మంచిదా హరిశ్చంద్రా.

చంద్ర—ఆమాట నలనిన్నను మానవే నక్షత్రకా.

నక్ష—హరిశ్చంద్రా ఆలస్యమొనరలకు వేయును త్రాడువేయును చేతికి త్రాడువేయుము అమ్మము.

హరి—చిత్తము. (అని చంద్రమతిచేతిక త్రాడువేయును) నక్షత్రా యేమని అమ్మవలెను.

నక్ష—నేనెప్పుడైన పెండ్లాని నమ్మకున్నవానినయితె చెప్పగను.

హరి— కీర్తన.

కొనరయ్యా కొనరయ్యా నాకులసతిని చ్ఛేద ॥ కొన ॥

1. మనుజుడేనుగుపై నెక్కి మరిగవ్వగోటమిూట । జనునో నంతె
త్తుఖనము । జాస్తిలేకుధర ॥ కొన ॥

2. యేకులమువారయిన యేమతమువారయిన। లోకవిరుద్ధముగక
లోలోన మదనపడక ॥ కొన ॥

3. ముంగుగిచ్చెదనని మునికిఋణముపడితి । సందేహమేమిదాసిగ
సంపదగలవారు ॥ కొన ॥

గీ॥ సమగుణంబుల వర్తించు ♦ సత్యశీల
సుజనసేవలు జేసెడు ♦ సుందరాంగి
దీనదశనచ్చియిట్టుల ♦ దెచ్చితయ్య
నమ్మవేసెదదాసిగ ♦ నమ్మరయ్య.

(శిష్యుడు జనార్దనుడు వెంటనుండ కాలకౌశికుడు ప్రవేశించి)

కీర్తన.

ఏమిరాజనార్దన యెందులకో యీవేళ । ఒక్కరయినజాడలేదు
రొక్కమేమి రాలేదు। ఏమి ॥

1. వేసవికాలపు సెలవలింక వెళ్లలేదుగామాలి । మూసినతలుపు
లు మూసినట్లు వ్రాసుకున్న ఉన్నాయి॥ ఏమి ॥

2. మీయమ్మగారితోడి నాగుముగదెబ్బలు బడితివి । చాయ
మేమిగాలేదు చదువుకోనుపోదాము ॥ ఏమి ॥

జనా——పంతులుగారండి యెప్పుడు ఒకరుచావాలి మేము బ్రతు
కాలి అనుకున్నారేమండి.

కాల——శిష్యా! అవనకును యిచ్చట దాసీలనమ్మెదమన్నట్లు కేక
వినవచ్చుచున్నది.

జనా——అదుగో యెవరో వచ్చుచున్నారుగా.

కాల——అయ్యా! యిచ్చట దాసీలనమ్మెదమన్నవారెవరు.

నక్ష——ఎందులకు నీవు కొంటావయేమి.

కాల——యేమొ వాలుగాడుంటె చూస్తామని.

నక్ష——నీవుకొనలేవు. అయోధ్యాపట్టణమేలు హరిశ్చంద్రునిభార్య

చంద్రమతీదేవి యీమె విశ్వామిత్రునకు ఋణపడి భర్తయి
ప్పుడు అమ్ముకొనుచున్నాఁడు. మనుజాధీనుఁడై యెక్కడ గన్నను
గోటమీఁటు యెంతెత్తుఁదురుగునో సంత్రద్రవ్యము వెల.

కాల——యిక్కడెంచెదనా యింటివద్ద యెంచుకొనెదవ.

నక్ష——(తనలో) ఏమీ యితని ధైర్యము హరిశ్చంద్రుఁడు బయలుపడు
రోజు బయిటబడినట్లున్నదే.

కాల——ఆకుఱ్ఱవాఁడెవరు.

నక్ష——వారిపుత్రుఁడే నీకు నచ్చునా?

కాల——(నక్షత్రకుని కేవలకుబిలచి) యిదిగో నక్షత్రకా! పనులేను
యిన చురుకుగా జేసేదేనా యీదాసి పిల్లవాఁడు జాగ్రతయిన
వాఁడేనా వెలమరింత సుమా.

నక్ష——నీకు నేనబద్ధమాడెదనా కాలకౌశికా! మనమారిగినవారల
మె యిట్లు జేసుకుంటే యింకా యేమున్నది.

కాల——కుఱ్ఱా యీవిస్తళ్ళకట్ట నెత్తిన బెట్టుకొనుము.

చంద్ర——నాయనా! తీసుకొనుము (లోహితాస్యుఁడు విస్తళ్ళకట్ట నెత్తి
న బెట్టుకొనును)

హరి——(దుఃఖముతో)

గీ॥ మనుజనాథుఁడనై మహీ ♦ మండలంబు
శిరమునిడుకొని నేలిక ♦ బరువడిగను
జేయుదగినట్టి లోహితా (నేలపైనొరుగుచు) శిరమునందు
విస్తరాకులకట్టను ♦ వేసెనటర.

చంద్ర——(దుఃఖముతో) నాథానాథా (అని నాథుని బిలచుచు
పడిపోవును)

లోహి — (విస్తరాకులకట్ట క్రిందవేసి) బాబూ బాబూ (అంటు నేల పైకూలబడును.)

నక్ష — (దీనవదనుడై నిలువబడి చూచుచుండును)

కాల — ఏమీ, యీ అన్యాయము. యేమీ యన్యాయము (అని అటు యిటు తిరుగుచుండును)

జనా — (దగ్గరకుబోయి వంగి) హరిశ్చంద్ర చంద్రమతులారా! మీకొమరుడు పొట్టబ్బ నేడ్చుచున్నాడు లెండిలెండి.

చ-హ — (లేచుచున్నారు)

హరి — (విస్మయ మభినయించుచు) దేవీ, యెక్కడనుండి ఆ. ఆ. కౌశికునికి రాజ్యమిచ్చితిమా యిచ్చితిమి. కాశీపట్టణము జేరితిమా, జేరితిమి. ఋణవిముక్తికొరకు నిన్నమ్ముకొంటినా అమ్ముకుంటిని కుమారుడు హా కుమారా! ( అని కౌగలించుకొని ) నాన్నా నిన్ను మరలా జూచెదనా. (తనలో) ఏమీ యీపారపాటు (ప్రకాశముగా) లోహితా నీకు అమంగళము ప్రతిహతమగుగాక. నీవు మీతల్లి వెంటుండని వారు చెప్పినట్లుచేయుము.

లోహి — బాబూ నీవురావు.

హరి — అయ్యో నేనురాను వలనుపడదు.

చంద్ర — తరలుము. సుజనవత్సల మాటలాడుము। జూచుడెన్నడో
మిమ్ముల్

హరి — అజహరాములకైనదప్పదు। యార్యవాక్యము లేమనా

చంద్ర — నిజముదప్పక యుండువారికి। నిత్యకష్టము లేలనో

హరి — భజనచేయుము పార్వతీశుని। పాదయుగ్మము నమ్మికన్.

కాల — నక్షత్రకా.

తెలుసుము। పగటి వేలుపు నత్తిమిరారికి । జారుచుండెను రాణికా

నక్ష—తగవదీనికి వచ్చుచుండి । తాళుతాళుము కొంచముగా

కాల—వగపు కెక్కుడి యాంతముగాను । నాకింకా కను చెప్పునగా

నక్ష—తగిన మాటలనాడుచుండెద । శిష్యమునియు చిక్కెనా.

చంద్ర—అయోధ్యాపట్టణాధీశా! ప్రాణేశా నమస్కారము సెల విమ్ము బిడ్డా రమ్ము.

చంద్ర కీర్తన.

పోవుచున్నారమయ్య సెలవీయుమయ్య। పోవుచున్నారమయ్యా।

1 పోవుచున్నారమయ్య బుద్ధులు చెప్పుమయ్య । అప్పాలు చెప్పు మయ్య ॥ పో ॥

2 నీమ్రొక్కుపదములయ్య నాహృదయమందు నిల్పు నాహృదయ మందు నిల్పు । పో ।

3 మరిమరిదయయుంచవయ్య । మరువకమనసులో మరువకమన సులో ॥ పోవు ।

గీ॥ మరల నెన్నటికో మిము ♦ కరువుదీర
జూచిమాటలాడుదువేళ్ళ ♦ జూచుభాగ్య

హరి.— మేమిచేయుదుమిట్టుల ♦ స్వామిజేసె
పోలతిమనవోము ఫలకుల ♦ పోయిరమ్ము.

నక్ష—యింకరండిరండి ఆలస్యము జేయకండి

కాల—దాసి యీమాటను నీవుతీసుకొనుము పిల్లవానికి విస్తళ్ళ కట్ట నెత్తుము. ( అని విస్తళ్ళకట్ట మూట నిచ్చుచు ముందు నడచును చంద్రమతీ లోహితాస్యులు మూటావిస్తళ్ళకట్ట దీసు కొని వెనుకకుతిరిగిచూచుచు కన్నీరువిడచుచు నడచుచున్నారు )

జనా——(నక్షత్రకునికై జూచుచుండును)

నక్ష——హరిశ్చంద్రా! నేను వీరివెంటవెళ్ళి ధనము తీసుకొని వచ్చు నందాక విశ్వనాథుని ఆలయమువద్ద కూర్చొనియుందుము.

హరి——చిత్తము. ఆలాగె. (నిష్క్రమించును)

(నిష్క్రమింతురు)

(కాలకంటకి గృహద్వారమువద్ద చీపురుగట్టతో ప్రవేశించును)

కాలకం——ఎవరురా కేశవా జనార్దనా మాయింటివారు అంగడికి వెళ్లి యింకనురాలేదుగా. ఆ. (అంతలో కాలకౌశికుడు జనార్దనుడు చంద్రమతి లోహితాస్యుడును ప్రవేశించుచున్నారు)

కాలక——అమ్మగో యెవరుజూచుచున్నది యేమో అంటున్నది చీపురుగట్టగూడా యున్నదేమో చూడుమురా శిష్యా చేతిలో.

జనా——యీవేళ నికేమో మూడినట్లుగానే యున్నది చీపురుగట్ట చేతులోనే యున్నది.

కాలక——యేమోరా నాయనా! యీమాట ముందే చెప్పకుర నాయనా.

కాలకం—— కీర్తన.

అప్పుడేనెప్పుడు వేరమగడ। యిప్పుడుదాకటిదిమగడ
చెప్పుచీపిరి దెబ్బలునీకు। తప్పవులెప్పుడురా రారారా।అప్పు॥

కాలక——పుట్టిననాడె వ్రాసిపెట్టెను। కొట్టుముచీపురుగట్టతో నెత్తిన
తిట్టకుదండము బెట్టెద పెట్టెద। పెట్టెద పెట్టెద పెట్టెద పెట్టెద।పు॥

కాలకం——పెట్టెద పెట్టెద వేమిటా? బోడుగోలివెధవి (అని చీపురు గట్టతో వీపుకు బెట్టి వేచును)

కాలకౌ——దండాందండం పెండ్లామన్నగారు దండం కొట్టాకు!

కాలకం.—జనార్దనా ఆమెగారెవరు.

జనా—అమ్మగారు

కాలకం—చరణ—అమ్మగారుగావలెనటర । బొమ్మలాటఆడెదవటర
రమ్మరమ్మతిమ్మక్కచెడ అమ్మఅమ్మఅప్పదాక అప్ప।

కాలక—కాయలుగాసెనుగడ్డలుగట్టెను కానుకాదుచెప్పెదవినుము
మాయలుగాదుదాసిగనికు। జేయుచుదెచ్చితి జేయనుదెచ్చితి 'పు।

చంద్ర—మగనికి చేయవలసిన మర్యాద యిదియేనా.

ఆ। వచ్చువానిజూచి ♦ భయముతో నెదురేగి
పాదములకు గడగి ♦ భక్తితోడ
పమిడిచెరుగుబట్టి ♦ పదములతడిసత్తి
శయ్యకేర్పవలయు ♦ శరణుజేసి.

కాలక—ఓసీ పొట్టకూటికి దాసిగవచ్చినదానవు నీవుగా నీతులు
జెప్పాలి యింతమాత్రము మాకు దెలుపుము దేశ గ్రామ యిం
టిమర్యాదలు నీకు బాగుగా తెలియును మా యింటిమర్యాద
వినుము.

ఆ। మగడువచ్చుచుండె ♦ మంచిచీపురుగట్ట
చేతనుంచుకొనియు ♦ చెవులుబట్టి
కొట్టికొట్టివిసికి ♦ కోపంబుదగ్గించి
పొట్టనిండకూడు ♦ బెట్టవలయు.

కాలక—(తనలో) మాయూరిది సమ్మసరిపోయెట్లు జెప్పినది
బలె. దీనికి నింకొక్కమాటజెప్పవలె (ప్రకాశముగా) యేమే
యి నా పెండ్లాం.

కాలకం.—ఏమిటి (చీపురుగట్టతో రెండువేసును)

కాలక — మరచిపోయె మరచిపోయె నా ప్రాణేశ్వరీ.

కాలకం — ఏమిటో యేమున్నవు.

కాలక — ఆ॥ హెచ్చుదెబ్బబెట్టి ♦ తెచ్చితీదాసిని
తగినపనులు జెప్పి ♦ తక్షణమున
జేయబంపుమింక ♦ చీపురుగట్టతో
నన్ను గొట్టబోకు ♦ నష్టమగును.

జనా — మన్మగారికి మేలుజేయుచున్న మయ్యగార్ని నిన్ను గొట్టు
చున్న దేమండీ.

కాలక — నీకేమి తెలుసు జనార్దన కొట్టితే మాత్రమేమి దానికిదగ్గ
అనుభవము మళ్లి బెట్టించుచుండెలె ఉత్తపిచ్చిది గోల.

(అందరు నిష్క్రమించుచున్నారు)

(హరిశ్చంద్రుడు నక్షత్రకుడు ప్రవేశించుచున్నారు)

హరి — యిక నన్ను కష్టపెట్టుట న్యాయమా నక్షత్రకా.

నక్ష — నేడింత కష్టమునకు [illegible] అడిగితే అదియుకష్టమా.

హరి — నీకష్టమునకు నేను బాధ్యుడనా.

నక్ష — చ॥ తినుటకు తిండిలేక నెల ♦ తిప్పితివెంతయు కానలందు నీ
వనుటకు నోరుయెట్లు తిరు ♦ గాడును జెప్పుడు నీకు దెల్యదా
వినుటకు సొంపుగాను రుచి ♦ పిడకయుండవలేను మాట నే
వనుటకు యేమివచ్చెనరె ♦ ఔనను కాదను నేను బోయెదన్.

హరి-ఉ॥ అమ్మతినాలినింక సుతు ♦ నమ్మితి రాజ్యము బోగొడంతయు
న్నమ్మని కేవికేమియును ♦ నారయ లేదని నీకు దెల్యదా
నమ్మకతోడ నేగుదయ ♦ చాలగయుంచుము భూమిదేవరా
పొమ్మని నన్ను జెప్పుయెట్లు ♦ పోయెద పోయెద వారిదప్పుకన్.

నక్ష—హరిశ్చంద్రా! నీవే అంతిగట్టిపట్టుపట్టినప్పుడు నేను వచ్చిన
వరకు నాకష్టముకింద చెల్లుబడినది యికనిప్పు నాకౌశికునికేమి
జెప్పుకొనెదవో చెప్పుకొనుము నేను వెళ్లుచున్నాను(వెళ్లును).

హరి—నాయనారమ్ము. (అని చెయిబట్టుకొనును) అయ్యా నన్ను
వరికై నవిక్రయించుకొనుము,యింతకన్న నేకేయునదేమియు లేదు

నక్ష—సరే ముందర నే ఆమాట చెప్పితె బాగావుండెను. (అని చేతికి
త్రాడువేయును) హరిశ్చంద్రా! సంశయమేమి లేకుండా, యెవ
రికైనను అమ్ముకొనెదను.

హరి—చల్లకువచ్చి ముంతదాచుకున్నట్లు యింక సంశయమేల.

నక్ష—(గొంతుదడువుకొని) కీర్తన.

కొంటరయ్య కొంటరయ్య శ్రీహరిశ్చంద్రుని కొనరయ్యకొనగాన్య

1. మనుజు డేనుగుపై నెక్కి మంగవ్వగోటమాట । జనునోసగెతె
త్తుఫలము జాస్తిలేమదని ॥ కొన ॥.

2. రోకులమువారియిక యేమ్మతిమువారయిం । లోకవిరుద్ధము
కల్లోల్లోం మదినుకిక ॥ కొం ॥

3. మునుగిచ్చెదనాన మునికిఋణముపడెను । సందేహమేమిదాను
గ సంపదగలవాడు ॥ కొం ॥

(వీరబాహుం బూచయ్య)

వీర— కీర్తన.

వత్తుండవత్తుండరా దూత్తదీచుకొని నేను వత్తుండరా!

1 తాటికల్లమనకవద్దు తాటికల్లమనకవద్దు। సారాయి మనకవద్దు
చప్పచప్పంగుంటాది బరణి బోయిచ్చర బల్ బాగుంటది
బరణియే యిచ్చర। వత్తు।

యూంగిరబూచమ్మ వత్తుంటె పోతవు.

బూ——యేంవిరయ నీపు నెన్నింబంగారుగాను రారావంటివు.

2 చరణము। వీర-తునకలమొన లేవద్దు గినకలఅసలేవద్దువద్దు నల్లదైన తెల్లనైన గద్దనోరికొట్టుమిందగారెలుండవు తెద్దుతెద్దు॥వ

3 కాటికావిలుండవాతే కట్టమేర కట్టమేర। నాటివుంచియుండ గాని నేటితోటియుండ లేదు॥ వత్తు।

(ప్రవేశించి)

వీర——ఓరె బూచిమ్మ యెక్కణ్ణో దాసోణ్ణమ్మా కేకికొత్తవిర.

బూ——యిటువుంచి అయ్యోర్యరొత్తున్నారియ యెవరో.

వీర——వత్తె తెలుత్తుందిలె యింక.

నక్ష——(హరిశ్చంద్రుని చేతి త్రాడుబట్టుకొని)

సీ। ఏడుదీవులరాజు ♦ లెప్పుడో వచ్చియు
కప్పముల్ గట్టెడు ♦ గొప్పరాజు
సత్యంబుదప్పక ♦ సతిసుతులమునమ్మి
ధర్మంబుతోనున్న ♦ ధర్మరాజు
కారణమును లేక ♦ కౌశికునకునోడి
రాజ్యంబునిచ్చిన ♦ రాజరాజు
యశ్వమేధంబులు ♦ యానందముగజేసి
పూజింపబడ్డ యీ ♦ పుణ్యరాజు

గీ॥ కాలవశమున దశదప్పి ♦ కడకు నేడు
బానిసీడుగ నమ్ముడు ♦ బడుచునుండె
ధనముగలవారలెవరైన ♦ తగినధరకు
యిచ్చివేసెద కొనరమ్య ♦ కృపనుగల్గి.

వీర—అయ్యోర్యరండి యిక్కడ దాసోహమ్మేమండి ఎవరియు (అని దగ్గరకు బోవును.)

నక్ష—నేనె యేమి పైకిపైకినస్తావు దూరముగాఉండుముస్నానము జెయ్యాలి.

వీర—బాప్మ్నలమీరు చదేచదే తెలియు లేదు తెలియనమాకు.

నక్ష—దూరముగానుండి మాట్లాడుము పొగాకురసము పెదవుల మీదనుండి కారుచున్నది.

వీర—మీరుముక్కుల్లోకన్న చెప్పేదంటేయు మీరు ముక్కుల్లోయేచుకుంటే మేము నోట్లోయేచుకుంటేమి మీరు రాచుకుంటె మేము గీచుకుంటెమి మీరు బతికున్నైతే మేముచచ్చిందాయును మాపిల్లగా జేసుకుంటెరి యీందియు అట్ల చీదరిచ్చుకుంటవు గాంధిగారాయన జెప్పుతుంటె యిట్లేదంటేయనీవు.

నక్ష—యీసుద్దులన్ని యేమిట్రానీవు కొంటావా యేమిదాసివాన్న.

వీర—కొంటానికి గదంటేను అవుగుతుంది చేపిత్తేమా చెయుడా.

నక్ష—అయోధ్యాపట్టణరాజధానిగా కోసలదేశమేలు ప్రభువు హరిశ్చంద్రుని కాలవశమున దానిసీమగ నమ్మబడుచుండును.

వీర—యిశ్వామిత్తునకు రాజ్యమిచ్చింది యీయనేనంటేను.

నక్ష—ఔను. వెలపనుగుపై మనుజుడెక్కి గవ్వగోటమీట నెంతెత్తునో నంతద్రవ్యము కొంటావ.

వీర—యింకరావియు యోచాత్తాను. హరిశ్చంద్రుడా యీకాసెత్తదీచుకొని బూచయ్యాంబడి యింటికిబద నేడప్పచెప్పెత్త బాప్నడికి

హరి—(దుత్తదీచుకొనును) స్వామీ నక్షత్రకా దయయుంచుము (అని నమస్కారము జేయును).

సత్య—(దుఃఖముతో) హరిశ్చంద్రా! నాథునా! నేనుబెట్టు కష్ట
ములకు నీకెంత కష్టమాయునో తెలియదు గాని నేననుభవించ
కమానను అది యెట్లనిన.

గీ॥ సుజనజనముల నెవ్వరైన ♦ చూడకుండ
నారికేమైన కష్టముల్ ♦ వచ్చునట్లు
జేయువారలు నిప్పుడో ♦ జీవితములో
నెప్పుడో దాని ఫలమొప్పు ♦ తప్పదయ్య.

హరి—బ్రాహ్మణోత్తమా దుఃఖింపకుము నీవు చేయునదేమియు
లేదు. గురువాజ్ఞ ననుసరించితివి.

సత్య—నిజమునిజము. హరిశ్చంద్రా! ఆవసిష్ఠుడు యీవిశ్వామిత్రు
డేల పందెము నొడ్డుకొనవలెను. తిరిగి విశ్వామిత్రుడే మాయ
తాను కష్టము తానుబడక నన్ను యిలాపంపుట లెందులకు
పంపినారా నేనుమాత్రము మిమ్ముల యింతకష్టపెట్టుటేల (ఆక
సమువంకజూచి) హా పరమేశ్వరా వీరి కుటుంబమును వీరి సత్య
మునను సరించి బ్రోవరా యెక్కనైనను బ్రోవర నేజేసిన పాపము
లుబాపుకొనుట కుపాయంబు తోచకున్నది యిప్పటనుండి
మీ పాదపద్మములు హృదయంబులో నిడుకొని నిక నెన్నటికి
యీటువంటివారి తెరవు నిక నెటువంటివారి తెరవు పోనని నీకు
వొప్పుకొనెదను తప్పను (వీరబాహు ఉన్న ప్రక్కకుజూచి)
ధనమెచ్చుటనోపద.

వీర—రావయ్య యిల్లిక్కడనె కడత.

(నిష్క్రమింతురు)

ఇది పంచమాంకము.



శ్రీరస్తు.

శ్రీ

# భజన సత్యహరిశ్చంద్రీయము.

## షష్ఠాంకము.



రంగము—వారణాశీపుర స్మశాన పరిసరారణ్యము.

(లోహితుడు కేశవ జనార్దనులతో ప్రవేశించుచు)

జనా—లోహితా! యీవేళ్ళ యేమాడుకొనెదము మనము.

లోహి—కాలమంతయు వృథా పుచ్చుచుంటిమి యీ వేళ్ళను హాయిగను పాటలుపాడుకొనెదము కేశవా.

కేశ—సరే.

అందఱు— కీర్తన.

శ్రీవిశ్వేశ్వర శ్రితజనవందిత। భావజహరణ పాలితసుగుణ॥శ్రీ॥

1. కరుణనుమముగను కన్నతండ్రి నిను। శరణనివేడెదము పాడెదము॥ శ్రీ॥

2. నారాయణకవిసారెకుబ్రోచిన। నారాయణాస్త్ర ఫాలనేత్ర ॥శ్రీ॥

లోహి—కం॥ పాటలు బాడితి హాయిగను

నేటికి మనయయ్యగారు ♦ నేరము లెంచక

సూటిగ బోదము రండిక

నేటికి సూర్యాంశుగతచె ♦ గ్రుంకెను దిశకుల్.

జనా—నిజము నిజము యీవేళ మనము బయలుదేరుసమయమున అయ్యగారు నిన్న రెండుమూడుదెబ్బలు కూడా వేసెను.

కే—జనార్దనా లోహితా స్వామి నేమి మనలను మాత్రము కొట్టడా గురుడు.

లోహి.—కేశవా జనార్దనులారా! మీరు పత్రములను గోయుడి నేను దర్భలనుగోసెదను అవిగో ఆపుట్టమీద చాలనొత్తుగా బెరిగున్నవి (పోయి కోయుచున్నాడు)

జనా—కేశవా! లోహితాస్యుడు మంచివాడుర మనకు అలకన పనిజెప్పుతాడు (ఆకులనుగోయుచున్నారు)

లోహి—అయ్యో, యింకేమున్నది పాముకఱచినది అమ్మా (అని పడిపోవును)

జ—కే—(పరుగెత్తుకొనివచ్చెదరు) మిత్రమా యెంతంగోకి అనుభవమాయెను యేమిసేతుము. (జనా) కేశవా చూడుము నోటివెంబడి నురుగుగూడా బహుచున్నది కాలి బొటనవ్రేలు గాట్లుబడియున్నవి యిక జీవించుట కష్టమే (జ—కే) లోహితా లోహితా (అని పిలచెదరు)

లోహి—(కన్నులుదెరచిమాంది) మిత్రులారా! నన్ను పాముకాటందినది నేను యిక యిల్లు జేరటందుర్ఘటం నేను కోసినదర్భలు మీరు కోసినఆకులు తీసుకొనుడు గురుడుకోపించునేమొ యింటికేగుడు (అని తిన్నగా లేచి కూర్చొనును)

జ—కే—మిత్రమా యీపాడు పాము నిన్నిక్కడ గఱచినది కఱచినను మామేలు నేకోరుచుంటివి నిన్నెటుల విడచిపోదుము.

జనా—లోహితా నీకేమయిన రొమ్ములో నొప్పిగా యున్నదా మంచి నీరొచ్చున్నవా దెచ్చెదము యేమిసేయుదుము నెవవు యేమి సేయుమనిన నది సేసెదము మాకేమియు సేయుటకు తోచలేదు.

లోహి—అన్నయ్యలారా! విషము తలకెక్కినది యిక నేమి సేసి ననుమానదు. ప్రయోజనములేదు నేజెప్పినట్లు ఆకులు దర్భలు తీసుకొని,

గీ॥ తొందరగఁబోయి మాగురు • కండజేసి
తండ్రియెటుబోయెనో పోయె • తల్లియైన
వచ్చి చూచిపోవీలున్న • వచ్చునయ్యొ
జెప్పరయ్య దయతోమమ్ము • జెప్పరయ్య.
(మాపువచ్చి మరల బాడుకొనును)

జనా—కేశవా యింక మనము చేయునదేమున్నది.
కేశ—మనకేమైన మాటవచ్చునా.
జనా-మనకేమిమాటయున్నదియీవార్త చంద్రమతితో జెప్పదము.
కేశ—లోహితా లోహితా.
జనా—లోహితా లోహితా (పలుకకుండుటను)

(నిష్క్రమింతురు)

(చంద్రమతిదేవి పిడకలేరుచు ప్రవేశించును)

చంద్ర—హా ప్రాణనాథా యెచ్చటనుంటివో గద యిప్పుడు యీ నాకష్టములను జూచిన నీమనసులో నేమనుకొందువోకద అల నాడీ విప్రుడు దాసీయని నన్నుదలించినప్పుడునీమనసమునందున్న సప్రేమను గనుగొంటి అదియుండుగాక నీకొమరుని నెత్తిపయి విస్తరాకులకట్టను జూచి నీవుబడిన మనోవేదన యింతయని చెప్పుటకు నాయూవిశేషునికైన తరమా. యిక నేనేమిజెప్ప దను చెప్పుటకువీలులేదు లేకపోయినను మేము వేళకు యింత కలో అంబలో త్రాగుచుంటిమి మీకు యెలాజరుగుచున్నదో యెచ్చటనుండితిరో సుఖమో కష్టమో తెలియదు.

గీ॥ వెన్నెలుండునచీకటి • వేగకుండ
చీకటుండున వెన్నెలు • రాకనుండ

కష్టసుఖములు కావడి ♦ కడవలనుచు
జెప్పచుండిరి తెలిసియే ♦ తప్పనిపుడు.

యీదినము వుదయమునుంచి కుడిపార్శ్వ మదురుచుండెను
యెందులకో. కీర్తన.

కుడిపార్శ్వమదురుచుండెను । కొడుకురాడు కడకునేడు దుడుకు
గాదు దైవమా దైవమా దైవమా। కుడి।

1 తగిలినకాలికినినే తగులునచుచు చెప్పదురు । తగిలివచ్చెనమా
కేయట్లు దైవమా దైవమా దైవమా। కుడి।

2 ప్రొద్దుగ్రుంకుచున్నదింకను పోయినవారు యెవరురారు ముద్దు
లయ్యనెపుడుజూతు దైవమా దైవమా దైవమా। కుడి।

అదుగో నాపుత్రునితో బోయిన జనార్దన కేశవులు వచ్చుచు
న్నారు. నాకొమరు డెనుకనుండెనేమొ(అని వారికి వేసియుండును

కేశ—జనార్దనా: అదిగో చంద్రమతీదేవి కొమరునికై మనవైపు
నెట్లు చూచుచున్నదో చూడుము.

జనా—కేశవా! యీవార్త నేనొక్కడనే చెప్పజాలను నీవుకొంత
జెప్పవలసినది.

కేశ—సరే. (ప్రవేశించుచున్నారు.)

చంద్ర—అయ్యా! నాకొమరుడు రాడేల.

జనా—అమ్మా చెప్పెదము వినుము.

చంద్ర—యేమినాయనా.

జనా—మమ్ములను పత్రములను గోయుమని తాను దర్భలనుగో
యుటకుబోయె పోయి నొకపుట్టపై దర్భలను గోయుచుండె.

చంద్ర—పుట్టపయిగోసినాడ నాయనా

కేశ—అంతట అమ్మా అని పడిపోయెను పాముగఱచి.
చంద్ర—హా కుమారా! (అని నేలపై బడిపోవును)
జనా—తల్లీ యింకొక్క మాట.
చంద్ర—యేమిమాట నాయనా.
జనా—అంతట మేము దగ్గరకుబోతిమి మిత్రమ మిత్రమాయని పిల
చితిమి. కన్నులుదెరచిచూచెను అప్పుడు యెక్కడనైనా నీకు
నొప్పిగాయున్నదా మంచినీరుకావలయునా యేమిసేయమనె
దవు నాయనా చెప్పుముచెప్పుమని యడిగితిమి అబుమీదతిన్న
గాలేచి కూర్చొని అన్నయ్యలారా విషము తలకెక్కినది యిక
కాదు నేసిసను మానను. ప్రయోజనములేదు నేచెప్పినట్లు ఆకు
లు దర్భలు తీసుకొని,

గీ। తొందరగబోయి మనగురు । కందజేసి
తండ్రియెటుబోయెనో పోయె ♦ తల్లియైన
వచ్చిచూచి పోవలెన్న ♦ వచ్చునట్లు
జెప్పరయ్యదయతొ మమ్మ ♦ జెప్పరయ్య.

అని మరల మంపువచ్చి పడిపోయెను మేము లోహితా
లోహితాయని చెవిదగ్గర జేరి పిలచితిమి పలుకకుండెను అప్పు
డు బయలుదేరి వచ్చితిమి నీతో యీవార్త యిప్పుడు జెప్పితి.
చంద్ర—నాయనా! మీరువచ్చునప్పుడు కన్నులు మూచుకొని
యుండెనా యేమైనా నోటివెంబడి తెల్లనినురుగు వచ్చుచుం
డెనా నాయనా బాగాజూచినారా.
జనా—అమ్మా చూచితిమి యిప్పుడు నీవుజెప్పిన లక్షణములన్ని
ఉన్నవి.
చంద్ర—అయ్యలారా! యిచ్చటకు యెంతదూరముండునో.

జనా—యిప్పటికు మేమువచ్చినమార్గమున కొంతవడికిపోగ నొక నుఱ్ఱిచెట్టొకటుండును ఆచెట్టునద్దనే నీకొమరుడు పడియుండును అమ్మా అదిగో కాలకంటకి వచ్చుచున్నదియిక మేము వెళ్లెదము

(యిరువురు నిష్క్రమింతురు)

చంద్ర—హా! తనయా హా లోహితాస్యా హా కరుణాలవాల కటికి దరిద్రమనుభవించుచున్న యీ చంద్రమతి కేనా పాడుపాము దాపరమాయెనా నాపాము నిన్ను కాటొందినపుడు యెంత భయపడితివో,

సీ॥ నినుజూచుటకు నేను ♦ మునుజూచెదనుగాని
కాలకంటకినాజ్ఞ ♦ గడుపవలయు
నినుజూచుటకు నేను ♦ మునుజూచెదనుగాని
కాళ్ళునాస్వాధీన ♦ కాళ్ళుగావు
నినుజూచుటకు నేను ♦ మునుజూచెదనుగాని
తెలివినశించెను ♦ తిరిగిరాదు
నినుజూచుటకు నేను ♦ మునుజూచెదనుగాని
కన్నులనిండెను ♦ గ్రమ్మెజలము

గీ॥ పండియుంటివ యడవిలో ♦ పలనునీవు
పండియుంటివ వటవృక్ష ♦ ప్రాంతమందు
పండియుంటివ నొంటిగా ♦ పాన్పుపయిని
పండియుంటివ నేనెట్లు ♦ బ్రతుకగలను.

యీవేళ నేనడువలేనమ్మా ని చెప్పితివిగదుర చెప్పినను గురుడు వచ్చి కొట్టిపంపించెను అప్పుడైన నిన్ను నిల్పుకొనుటకు నోచుకొననైతి హాప్రాణపతీ నీవెక్కడుంటివాకదా కొమరుని

కష్టము తెలియుదుగదా నేనేమిచేసెదను కనులనైనా జూచు కొనుటకు మావారపానిగారిదయ వచ్చునోరాదో.

కాలకం—(ప్రవేశించి) యేమిటే అంసనారీ యిచ్చటనే ప్రొద్దు బుచ్చుచున్నావు యింతసూత్రధారిని నేనిచ్చటఁజూడలేను. మనుష్యులున్నప్పుడు ముఖము నల్లగాబెట్టుకొని మాట్లాడకుండువు మనుష్యులు లేనప్పుడు యేమేమొ ప్రసంగాలు యేమేమొ ఆలోచనలతోనుండువు వంటలింకా వేరుచున్నావటే.

చంద్ర—అమ్మా నాకొడుకునకు పాముగఱచినదట.

కాలకం—ఎవరుజెప్పితిరి.

చంద్ర—నాపుత్రునివెంబడి అడవికివెళ్లిన మీశిష్యులు జెప్పితిరి.

కాలకం—బోలెడుసొమ్ముబోసకొంటిమి మాకేకావాలి దండుగ నీకేమమ్మా వగలమారియేడ్పులు యేడ్చెదవు (కోపముతో) యికనైన వంటలుదీసుకొనిరమ్ము ఆడ బోలెడుపన్లు గనిపెట్టుకొని యున్నవి.

చంద్ర—అమ్మా కన్నకడుపు.

కాలకం—యేమే యింకా సామెతలు జెప్పబోయ్యేవు మీ ముఖాన బోసిన డబ్బంత మునిగిపొయ్యేదేకదా యేవోవొంక వంకలు బెట్టుకుంటు కూర్చుండాలి.

చంద్ర-గీ॥ కన్నకడుపిది గనుమమ్మ ♦ గ్రాగుచుండె
ఎన్నివిధముల దుఃఖంబు ♦ హెచ్చుచుండె
విషముతలకెక్కి పడియుండె ♦ సుతునుదప్పి
వైద్యునైనను బంపుమీ ♦ వందనంబు.

కాలకం—యేమిటే? ఓసీదాసీ.

గీ॥ ఇల్లుగుల్లగ జేసితి • వింక దైన్య
లేలమానులేల మనము • యేలఁబోయి
పుట్టపై నెక్కి బాముపై • బెట్టనేల
కాలుగఱిపించుకొననేల • కష్టమేల.

మందులుగిందులు వైద్యాలు గియిద్యాలు మా చేతగాదు నీవెపోయి లుగసాల్నో బోగమూటన్నట్లు చూచిరావలసినదే మాపనులన్ని చక్కపెట్టి మమ్మునాల నిద్రబుచ్చి యింక రమ్మ మాసొమ్మ అందరికి సులకనే. (నిష్క్రమించును)

చంద్ర—అయ్యో! యెంతకష్టములోనుండెనో నాకొమరుని చూచుకొనుటకు నైన యిప్పుడునోచనైతి. (అనిపోవుచున్నది)

(హరిశ్చంద్రుఁడొక కుండ మూపుపై బెట్టుకొని ప్రవేశించుచున్నాడు)

హరి— కీర్తన.

పోయెను పోయెనుగా నా ప్రాణలక్ష్మి నన్ను బాసి ॥ పోయె ॥

1. పోయెను రాజ్యము పోయెను సంపద । పోయెను నను విడచి పోయెను యిప్పుడు ॥ పోయె ॥

2. షడ్రసోపేతములు చక్కగానారగింప । శయ్యను జేర్చువర చంద్రమతి దేవి ॥ పోయె ॥

గీ॥ కుండమూపుపై వచ్చును • కోరకుండ
దండిభూదేవి దిగెభుజ • దండనుండి
గాటికాపరి పనియయ్యె • కడకురండి
బీటికిఁగాయు వెన్నెల • ప్రేమనుండి.

అహాహా సురభాండమాయెను నీ యైశ్వర్యము విశ్వవిశ్వంభరాభరణుఁడనై భూభారంబు దాల్చు భుజంబుపై నెక్కి యీ

హరిశ్చంద్రునిచే కాదు కాదు వీరదాసునిచే మన స్వామికి కల్లు మోయించుచుంటివా ప్రతిదినము కాటిదగ్గరకు బోవుచుంటిమి అవిగో చీకట్లు దిక్కులనుండి క్రమ్ముకొను చున్నవి.

సీ॥ జారచోరులపంట ♦ జగములన్నిటనింట
నక్షత్రములపంట ♦ నాయుమాట
పరితాపములజంట ♦ భయమునకొనంట
నిదురకు నేవంట ♦ నింగికుంట
కరుణనువిడుకుంట ♦ కానిదేవియుకంట
తెల్లలేవిదివెంట ♦ తెలుపుకుంట
దయ్యాలజయమంట ♦ తక్కువేసుకుంట
పగంపూటకుమింట ♦ బలుకుకుంట.

గీ॥ చంద్రబింబమువచ్చనా ♦ జాడగంట
క్రూరమృగముల తల్లినేఁ ♦ కూరుకుంట
పుణ్యపురుషులుయెరవి ♦ పుట్టుకుంట
కటికిచీకటివచ్చెను ♦ క్రమ్ముకుంట.

(కొంచెముముందరకు నడచి) అవిగో దిక్కు లేక తక్కువగా కళ్లెలుబేర్చినశ్మశానవాటికలనుండి కాలిన పీనుగులక్రింద కు బడనెట్టి తిని భూతభేతాళ గణంబులు నాట్యము సల్పుచున్నవి కాలిన కపాలబొచ్చులతో తాళములు వేయు చున్నవి. కొన్ని పీనుగులను యాకలిదీరక పట్టుకొని పీకి తింటున్నవి. ఓహో యిక్కడెవరో కాటిసుంకమివ్వక నే పీనుగను కాల్చుచున్నాడు. (రెండడుగులు ముందునకు వేసి) ఎవరు నీవు కాటిసుంకమివ్వక నే పీనుగను కాల్చుచున్నావు యేమిటీ నేనే

పోరపాటుబడితిని కాదుకాదు, రొమ్ముమీద యెత్తిన బరువు
కట్టెతొలగిపోయినది అందుచే పీనుగుయే లేచి కాలుచున్నది

గీ॥ బ్రతికియున్నాళ్ళు సుతులని ♦ హితులని సతు
లని మమతవహించుటేకాని • కనుగొనవిపు
డేది యీకట్టెలంగాలు ♦ చెంచులకని
రాజయొనరైన తప్పింప ♦ రారుయెవరు.

1. మాయాజగంబిదిరా మహిమ తెలియదు। మాయాజగంబిదిరా॥
2. మాయాజగంబిది హేయమయినది। కాయముకదీనిలోబడినవారు
మును నాయముగానక బోయిరియెటులో ॥ మాయ ॥

ఛీ! ఛీ యీజన్మమెత్తుటయే నీచము. యెత్తినను, దుష్టకర్మ
ముల నాచరించుట మరీనీచము చూచినకొలది వైరాగ్య మధి
కమగును స్వామికార్యము భంగమవును యిక నా మంచవద్దకు
నేను బోయెదను. దయ్యములు గుంపులు నరమాంసంబుదిని
నాట్యము సల్పుచున్నవి. ఐనను, యొకకొరవిదగ్గరుండుట మేలు
(అని కాలుచున్న కట్టెనొకదాని చేతబట్టుకొనును. నడచిమంచ
యొక్కను)బలె యేమి యీదినముయొక్క మహాత్యము.

గీ॥ వేలకరదీపికలుచుట్టు ♦ వెలుగుచుండ
మధ్యసింహాసనంబుపై • మరియునుండ
నాట్యకాంతలువచ్చియు ♦ నాట్యమాడ
ప్రొద్దుబుచ్చుచునుంటిని ♦ పొలతితోడ.

నీకేమయిన పిచ్చాహరిశ్చంద్రా! యేరివార నెదవేమొ చెప్పె
దనువినుము. యీమండుచున్న కాష్టము లేకరదీపములు వాటి

లోనుండి కాలువారె వాటికి సమురు వేసి వెలుగించు సేవకులు ఆసింహాసనమే ఈసింహాసనము. ఆరాజే ఈరాజు యిప్పుడాడు చున్న స్త్రీలే వారకాంతలు. ఆతగులనడుచున్న కపాలికములే తాళములు. ఈగంగానదియొక్క తరంగశబ్దములే మృదంగశబ్దములు కాలుచున్న కాష్ఠములలో కరపచ్చివి కాలుచున్నపుడు సుయ్యను శబ్దములిచ్చుచున్నవి. ఆశబ్దములే అన్నిశ్రుతులు పిడేళ్లు వీణెలు గూడ పాటలే మంటలరవరవములు మంత్రి సామంతి పండిత పామర జనంబులే భేతాళగణంబులు స్తోత్రంబులే వెరసి వీటియన్నిటికన్న వైరాగ్యమనెడు కాంతయే సికాంత యిపుడు చేతిలోయున్న కొరవియే చంద్రాయుధము యికనిదు తరుగేమున్నది కొమరుడుండడా జ్ఞానమనువాడే కొమరుడు రాజ్యమేదంటావా నిశకరమే రాజ్యము దీనిలో సప్తద్వీపములుగలవు. పదునాల్గుభువనంబులును గలవు గలవు చరాచరంబులు మేడలుగలవు మిద్దెలుగలవు యిరువురు యెప్పుడు నిద్ర వచ్చుదాక చూచుచుండువారు గలరు వాటికి సహాయము విను వారుగలరు. రాత్రి బవళ్లు విసుకు విరామములేకుండ దిరుగువారిరువురుగలరు. గరండీలు గరండలు గ్రుంగుచా చోకముగలవు. సకలవార్తలను తెలుసుకొని పరిపాలించు నైస్రియుగలదు. అనగా రీడింగు ప్రభువుకలడు కలడు కావలసినదంత యిచ్చువాడుగలడు బలె ఏమీ ఈదినముయొక్క మహాత్యము (అనికొరవి బారవేసికూర్చుండును) ఈదినము యెంతఆనందము దెచ్చుకొన్నను నాపుత్రుడు నాభార్య యేమో తలుపుకొని వచ్చుచున్నారు కారణమేమో తెలియదు నేనేమిసేతును.

కీర్తన.

ఎప్పటనుంటిరో మీరాదు నే। నిప్పటనుంటినిరాదు
ముచ్చటలాడరముద్దుకుమార । వచ్చిచూచిపో మచ్చికంటె
నను ॥ ఎప్ప ॥

1. కాలకౌశికువింట మీరాదుకష్టముజేయుచున్నారు । కాలను
యిట్టుల కలసివచ్చెన మాలవానికి కూలినైతినే ॥ ఎప్ప ॥

2. నారాయణకవి నేలు శ్రీ నాగభూషణుడు మేలు । వారక మన
లను నచ్చికలుపునో యేరికి యెరుకో। యేమిజెప్పుదును ॥ ఎ ॥

హరిశ్చంద్రా । మరచి ప్రేమించుచుంటివా ఛీ! నీయంతకఠిను
డీబ్రహ్మాండములో గలడా లేడు లేడు. నీపుత్రునికష్టముల కడ్డపడి
తివా! నీభార్యను దాసీగనమ్మక శత్రువునికి నైకమిచ్చి సమా
ధానము జెప్పితివా లేక యెవరికేమి మేలు జేసితివీవు.

సీ॥ పుత్రకు నేమైన • భూమీశుగా జేసి
పాలింపమంటివో ♦ పరగ నీవు
భార్యకు నేమైన ♦ ప్రబలసౌఖ్యములిచ్చి
సుఖపడుమంటివో ♦ సుమతి నీవు
నినువిశ్వసని మొర ♦ బనిగొన్న మంత్రిని
పిలచిరమ్మంటివా ♦ ప్రియుడ నీవు
వారలదుఃఖంబు ♦ బరిమార్చి నీవిటు
దయచేసియుంటివా ♦ దాత నీవు

గీ॥ ఏమిసేయగలేక నే ♦ నేమిసేతు
ననుచు పలుమారు ప్రేమింప ♦ న్యాయమేమి
యూరకొనుమిక నైన నీ ♦ వుత్తమాట
జేయదగియున్న పనియున్న ♦ జేయమనగ.

అదిగో నేదో నిక్కుతెలియక దుఃఖవార్ధిలో మునిగి దీనాలాపప్రభంజన వాక్యముల హీనస్వరము వినబడుచున్నది పోయి చూచెదనుగాక.

(చంద్రమతీదేవి మొకదరిగా ప్రవేశించుచు)

చంద్ర—(దుఃఖముతో) కీర్తన.

హాలోహితాస్యనను అమ్మాయనిపలుకవర । హాముద్దులయ్య నాకగుపడవేర ॥ హా ॥

1. గాఢాంధకారమహా కటికిచీకటిరా । క్రమ్మియున్నదడవి కనజాలని నివనిని ॥ హా ॥

2. పాముగఱచినదాని భయమునశితినయ్య । పాము గఱచినవాడు బ్రతుకుకారయ్య ॥ హా ॥

3. నారాయణదేవుని నమ్మితిమయ్య । కారుణమిటులాయె గనర మాయయ్య ॥ హా ॥

ఆగంగాభవాని నాపై నీకేల కరుణరాకయున్నది నవ్విన ఘోషంబును జాలించి నాకొమరుని వార్తి జెప్పవదేల చెప్పిన నీకేమైన మాటయా ఔను ఒకరియాజ్ఞలోనున్నదానవు చుక్కలారా మీకు మీపతితో మాటయ చూచుచుంటిరి దేల.

గీ। చూచుచుంటిర దేలనో ♦ చుక్కలార
ఊరకుంటిర దేలనో ♦ బీరులార
పరులకపకార మెరుగని ♦ పక్షులార
శరణుజేసెద వృక్ష సు ♦ జాతులార.

విశ్వనాథా! నీకేమైన పగజేసితినా గాధినందనా కష్టముల బెట్టుటయే నీపనియా హా! ప్రాణేశ్వరా నీవైన తోడుపడవా!

(అనినడుచును) నాకాలికేదో మెత్తనిపదార్థము సోకినది నా
కొమరుని మృతగాత్రమా నా (పరికించి) హా లోహితా! పలు
కకుంటివా (అని శవముపై నొరుగును లేచికూర్చొనును)యీ
కటికనేలపై అర్ధాన్నపడవిలో పడియుంటివా తండ్రీ (అనిశిర
స్సుకాలిపైకి జేర్చుకొనును) నాయనా పలుకవేమిరా నాకా
లుదగిలినదనే నాయన కానకతగిలినదిరాతండ్రీ! పలుకరా రా
కా శశాంక చంద్ర బింబడంబమును విడంబము జేయు నీముద్దు
మోము నొక్కసారి విప్పిమాటలాడరా! నీకు నామధారణ జే
యవచ్చిన పెద్దలు నొష్టకిరీటము వీపున వింజామరయు అరికాలి
న తామరపద్మము హస్తమున ధ్వజరేఖలు త్రివళియము కంఠ
మున గలవని చెప్పిరి. హా సర్పరాజమా నీ వెంకులకు మనుష్యు
లను, తదితరజంతువులను గఱచిచంపుట యిదివరకే నేలపైపొ
ట్టతో (పాకుచుంటివి, నీనాల్కలు రెండాయెను చూచినవారె
ల్లనిన్ను చావమోదుచుంటిరి. అయినను నిన్ననేల నాదరిద్ర
మే నన్ను కాల్చుకొనిపోవుచుండ.

కీర్తన.

నోములెన్నినోచికంటినో। స్వామియిట్టులజేసెనా స్వామియి
ట్టుల జేసెనా॥

1. సోముని గేరువదనంబును। కాముని మీరుసౌందర్యంబును నీమ
ముగా పాదహస్తతళములు। తామరలనుబోలియున్నవి॥నో॥
2. తుమ్మెదరెక్కలవంటి వెండ్రుకలు। కమ్మవిల్లువిలు బోలుకను
బొమలు। తమ్మిలకుమిన్నయయినకనులు। సమ్మతిసంపం
గి సరస్వతులు ముక్కుచెవులు॥ నోము॥

రెడ్డిబోడుకు చుక్కయ నా కనుపమునది నడుచేయుకు మిం
చినది దొరసానిగారియింటిపనులకు సంసిబోవలెను. పిల్లవాని
దహనకార్య మెట్లుజరుపవలయునో తెలియకున్నది శ్మశాన
మెక్కడనో అంతుబట్టదు అయినను దిక్కులేని వారికి భగవం
తుడేదిక్కు. (పిల్లవానిని భుజంబుపై పరుండబెట్టుకొనును లేచు
ను లేచి) నేటికెంత కాలముసంభవించెనురాతండ్రీ! మాకింత తల
కొరివిబెట్టి తలిదండ్రులకుదహనాదిక్రియలు జరుపవలసినది మా
చేతనేనీవు తలకొరివి బెట్టించుకొనుచుంటివా తనయా తనయా
ఎంతపాపగాలము సంభవించెనురాతండ్రీ ప్రాణేశ్వరానిన్నుతోడు
గాకున్న నేనెట్లు శ్మశానభూమిచేరుదును. యిప్పుడు కాళ్లుగడగ
డవణకుచున్నవి. గంగానది యొకవంక భోరుమని ఘోషిస్తున్నది
ఝిల్లీనినదంబు లంతటల్లుకొని మిన్నుముట్టుచున్నవి నొంటరి
లిన నాకుచీకటిబెదరు గాచుచేయున్నది.అదిగోఅచ్చటనేమొ వెల్గు
రుగనుపడుచున్నది. అదియె శ్మశానవాటికగావచ్చును(రెండడు
గులువేయును) ఏమీ నాసహాసముఅనుచుండగనే పితృవనము
జేరితిని. యొంతకటికిగుండెదానను తప్పునిసరివారను నా యిచ్చట
పండుకొనుము చితికి కట్టెలువేరుకొనెదను రాజాధిరాజకుమా
రుడవైనను నీకు యిట్లు (అట్లుచేయును)

గీ। చిన్నిపుత్రకనిన్నెట్లు ♦ చితినిజేర్చి
అగ్నిరాలగజేసియో ♦ యంసనారె
కాలకాశుకునింటిలో ♦ గలుగుపనులు
జేయబూనుచునున్నది ♦ చీయనగను.

యెన్నికష్టములువచ్చినను సత్యముదప్పకయుండు టేమంచిది
గద (శవము నెత్తుకొని చితిపైబరుండబెట్టును)

హరి—(ప్రవేశించి) ఈమూలనెవరో స్త్రీ యేడ్చుచున్నట్లు వినబడుచున్నది. పోయిచూచెదను.

చంద్ర— కీర్తన.

కన్నులెత్తికన్నకుమార ♦ నన్నుబిల్వకన్నకుమార
పన్నగనేటితో నన్నువిడచియు। పరలోకంబునకరుగుచుంటివి॥క॥

1. మోముజూపరముద్దులయ్య। ముచ్చటాడరముద్దులయ్య
స్వామియింతసరిగజేసెను। చక్కనయ్యవొక్కసారి॥కన్ను॥

2. పూర్వజన్మమందునేను। పుణ్యమేమిజేసినచ్చితో
సార్వభౌముసతినైతునకు।చావుమనెనుసరసిజభవుడు॥క॥

3. నారాయణకవికోరినవరములు।సారెకునిచ్చుమశంభుడునువలను
నేరములెంచో భారమనెంచో । తీరనిదుఃఖము దినమున
బెట్టెను॥ కన్ను॥ (చంద్రమతి, చితిరవులజేయును)

హరి—ఎటుమరలిన చంద్రమతిలోహితాస్యులే కనుపడుచున్నారు కారణమేమొ తెలియదు కానిమ్ము. ఆ ఆడుదెవరో దహనకార్యముగూడ జరుపుచున్నదే యెంతపడచినను కాలుసాగదు (త్వరగా నడచును)

గీ। ఆడుదానవ నీవునే ♦ డసురదాన
నాయెరుకలేకనడిరేయి ♦ యగ్నిరాల
జేసితివి చితికింకను ♦ జేయుమయిన
వీరదాసునెరుంగవే ♦ యోరిసొమ్ము.

(చితిబడదన్నును)

చంద్ర—హా తనయా బ్రతికినన్నాళ్ళుగాకతరువాతను యిటువంటి కష్టములు సంభవింపవలసివచ్చెనుగదరా తండ్రి నీకు.

హరి—(తనలో)ఏమీనాసతిసుతులుగా నున్నారేమీరు ఆ నా దంపూ హాకుమితము లేదా వారలకెప్పుడు యిటువంటి కష్టములు రా కుండుగాత. (ప్రకాశముగా) ఎవరునీవు కాటేసుంక మిన్వక నే యిట్లు జేయుచుంటివి.

చంద్ర—అయ్యా, నాకు తెలియును తెలిసినను శరీరమాత్ర విభవ నైయున్నాను.

హరి— వృత్తము.

పామ్మపామ్మ యిప్పుడే । పాలతిమాటలాడవలదు.

చంద్ర—నమ్మమాటలేలముంగ । నయము విన్నవంబుమొకటి

హరి—సమ్మతింప నివు నే । సమముమాట జెప్పనిక

చంద్ర—తమ్ముడంగివారలే । దయనుదప్పవల్యవలదు

హరి—(తనలో) ఈసతిమాట లొక్కొక్కమాట నోహాలమూట గా గన్పట్టుచున్నవి. అనకూడదుగాని చంద్రమతియే నేమొ (ప్రకాశముగా)రూక నొకపాత పిడమునకు తండులములు యివ్వలేవా.

చంద్ర—(తనలో) వీరుయెవరో మహాపురుషులాగు కనుపడుచు న్నారు. యిప్పుడు కష్టములువచ్చి వీరదాసుడాయెనా కావ చ్చును నేనుఅంగనారినికా లేదా అటులనె గాంచినిండిగినసంగతు లేగాక నా సవిస్తరమంత చెప్పకొనెదనువీరితో(ప్రకాశముగా) స్వామి శరీరమాత్రపు వ్యక్తినని మీతో నకాణించుకొని యుంటిని యిప్పుడు యీపట్టణములో నొకవిప్రునియింట పనిజే యుకూలిదానను నేనుఅంగనారిని ఈనాఏకపుత్రుడు గురునాజ్ఞ ప్రకారముఅడవికిపోయిదర్భలనుగోయుచుండ బాముగఱచిమృ తిబొందెను రూక నొకపాత పిండమునకు తండులములు యెట్లు లభించును.

గీ॥ కలమహాస్పృష్టిలో తేల్కె ♦ గడ్డిపోచ
దానికన్ననుదరిద్ర ♦ మానుగన్న
దీనికన్నను యనృతంబు ♦ తేలిపోవు
తతవితతిహింసగలవాడు ♦ తగ్గిపోను.

హరి—సుమతీ నీచిత్తమును గనిపెట్టితిని నీకొమరుని దహనమున
కై నొక్క మాట.

గీ। బాలసూర్యుని ప్రభలతో ♦ ప్రభలవెలుగు
నీసుమాంగల్యముఁ గానీ ♦ వాసుతేల
దానినమ్మిన పనులన్ని ♦ తరలిపోవు
అమ్మకొనిరమ్మ నిచటనే ♦ నైసముంకు.

చంద్ర—(భయపడి) పార్వతీ పరమేశ్వరులసాక్షిగా అగ్నిసాక్షిగా నా పతినాకు ధరించిన మాంగల్యము వసిష్ఠుని మహాత్మ్యముచే రెండవాని కగుపడునా నగుపడును నామగనికిదప్ప యితఁడు వీర దాసుడుగాడు నాపతి హరిశ్చంద్రుడే (అని కౌగలించుకొని) హా జీవితేశ్వరా హా నామనోహరా రవికులాంబోధి సోమరాజరాజ శ్రీహరిశ్చంద్ర మహారాజా! మందభాగ్యురాలనగు నీజీవితేశ్వరిని చంద్రమతిని అల్లారుముద్దుగా పెంచిన నీకొమరుడు యెట్లు బడియుండెనో చూచుచు మీకీకష్టములు వచ్చెనా దేవా అల్లనాడు ఆవిశ్వామిత్రమహాఋషి అకస్మాత్తుగావచ్చి నిన్ను వొప్పించుకొని ఏనుగుపై మనుజుడెక్కి గవ్వగోటమీట మొంతెత్తు జనునో నంతెత్తుద్రవ్యము యజ్ఞమునకైనడిగెను సరే మీరిచ్చెదనన్న తీసుకొనక మీతావుననే యుంచమని యేలచెప్పె చెప్పినవాడేమాయెను మాయమృగములను మాతంగకన్యలను నేలా

కల్పించెను కల్పించినను మనమేల మృగవధకై వారియాశ్రమ
మునకుఁబోయితిమి. పోయినను సకలసామ్రాజ్యపట్టాభిషిక్తునిగా
శ్రీవారినే జేసితిమి జేసియూ ఘోరారణ్యముల పడరాని యిడు
ములపడి కాశీపట్టణము వచ్చితిమి వచ్చి విశ్వనాథునిపూజించి
తిమి మరియు మహాఋషిఋణంబునకై నన్ను నెవరికైనా దాసీ
గావిక్రయించమన విక్రయించి నక్షత్రకునకు ఋణముచెల్లించి
తివి చెల్లించి సుఖములు పడెదవనుకొంటిని సుఖములనటుంట పో
నీ యీనీచమగు కాటికాపరితనమే నేటికి నీకులభించెనా హా నా
థా! నేటికినీకు లభించెనా.

సీ॥ జానెడుపొట్టకై ♦ సకలదేశములేల
నడుచు యీశనికేకు • నప్పెనేమొ
శమదమాదులువచ్చి ♦ సరిగనిల్చుటకునై
చప్పిడీయన్నంబు ♦ నొప్పెనేమొ
వైరాగ్యమనెడు శ్రీ ♦ వరియించుటకునిన్ను
మురికిపాతలునీకు ♦ దొరికెనేమొ
జ్ఞానభక్తులురెండు ♦ కలసియుండుటకునై
ఔనుసంసారమె ♦ డస్సెనేమొ
గీ॥ లేకయిటువంటికష్టముల్ • నీకురాను
సత్యమింతైనబాయక ♦ క్షమముతోడ
పాలనము జేయుచుంటివి ♦ పార్థివేంద్ర
పరమపావన దేవేంద్ర ♦ పాపహరణ.

హరి.—ప్రాణేశ్వరీ! యెంతకష్టము యెంతకష్టము యీబాలుడు మన
సుతుడా నీవునా జీవితేశ్వరివా శివశివ హా బాలకా (అనికుమా

రు నెత్తుకొని ముద్దాడి) నాయనా లోహితా మా మందభాగ్యులగు తలిదండ్రులవద్దయుండుట కష్టమని అలిగి సురలోకంబున కరిగితివా యిక మేము మనుటయెట్లు అదియుండుంగాక యెన్ని కష్టములువచ్చినను ఒక్కగాని ఒక్కపుత్రుడుండెనే మనకని యెట్లట్లో ప్రాణములుబిగిబట్టుకొనిజీవించుచుంటిమి మమ్ములను అనాథలనుజేసి నీవు వెళ్లుటన్యాయమా తండ్రి నీవుమాత్రము సుఖములేమి యనుభవించితివి.

గీ॥ రాజ్యసింహాసనాసీన ♦ రాజువైతొ
మంచిసతిని వివాహమై ♦ మంచివైతొ
సంచితంబులువీడ మం ♦ బెంచవైతొ
యెంచిచూచిన నెవిధాన ♦ మించవైతొ.

నానా యెంతమురుకాలము సంభవించెనురా తండ్రీ! మాలో నెవరికైనా నాపాము గలువరాద చావరాద నీవున్న మాకింత చేయవలసిన పనులుచేసి వంశాంకురమును వృద్ధిజేయుదువు గదా మేముండినప్రయోజనమేమి.

చంద్ర—నాథా! ఈదుఃఖమునకంతములేదు చేయునదేమియులేదు యిప్పుడు తెల్లవారుజాము అవుచున్నది దొరసానిగారి పనులకందుకోవలెను యెటులజరుపవలయునో చెప్పుము.

హరి—నేనిర్భాగ్యుడను పరమదరిద్రుడను మందమతిని నేనేమి చెప్పజాలను పిండాశనముమాత్రము మానుకొనెదను మాడపాత నెట్లైన మీదొరసానినడిగియైన నీవే తేవలయును అవి మాస్వామికి జెందవలయును.

చంద్ర—సరే పోయి మాదొరసానిని ప్రార్థించెదను పరమేశ్వరునిదయ యెటులున్నదో.

హరి—తొందరగా వెళ్లుము నీవు వచ్చువందాక నేనిచ్చట నేయుందును
(చంద్రమతి నిష్క్రమించును)

హరి—(లోహితాస్యుని కడ జేరి) హా పుత్రరత్నమా!

కీర్తన.

నాపుత్రరత్నమ నిన్ను నమ్మియుంటిమి గదర నాకేమి జెప్పెదవు॥ నా
నాపజాలను దుఃఖ మేపూటయైనను తాపత్రయంబులలో దగిలి
త్రిబ్రతుకు టెట్లు॥ నాపు ॥

1. కన్న కడుపుగాన కాలిపోవుచున్నదన్న నీకన్న నాకెన్నటికి యెవరు లేరు చిన్నన్న నిన్నాదరించెవరు! కన్ను లెత్తి చూడుమన్న గానిన న్ను చిన్న జోయెద వేలనే మన్న నీకన్న॥ నాపు।

2. నారాయణాఖ్యుని బ్రోచె మేరుధీరుని కృపగలిగుంటె। యీరీతి నీవు గాకుంటె దారిలో మమ్ములగంటె । తారకమహామవను కుంటె చారెడేసి కండ్లు చంద్రబింబమునదనంబు। నాపు।

ఏమిటా కలకలము (ఆలించును)

(తెరలో) వినండి వినండి వినినవారెవరో వినని వారెవరో ధనాశ చే రాజుగారియింటిలో జొచ్చి రాచబిడ్డం జంపి పారవేసిన శిసు హంత్రిని [illegible] వారు శిరస్సు కొట్టించమని యాజ్ఞాపించినారు గనుక దీనిని వధ్యశిలయొద్దకు దీసుకొనిపోవుచున్నారము.

హరి— రాజభటులు యెవరో శిశుహత్య జేసిన పాపిని పట్టుకొని వచ్చుచున్నారు.

భటులు—(ప్రవేశించి) ఓయి వీరదాసూ యీబిడ శిసుహత్య జేసి నదితలనరుకవలెను రాజుయాజ్ఞ యిదిగో వీరబాహుని మానవాలు.

హరి—(తనలో) ఈమె చంద్రమతియేనా కాదా ఔనా నేను ఘోర

పాటుగా జూచుచుంటినా (ప్రకాశముగా) అయ్యా ఈబడ నిజ
ముగా హత్య జేసినదేనా.

భటు—మరలమాటలేలా నివారాజా తెలివికలవాడవు.

(నిష్క్రమింతురు)

హరి—(తనలో) హా దైవమా చచ్చినవానినే చంపెదవా! కొడుకు
జచ్చి పుట్టెడు దుఃఖములో మునుంగు మాకే యీకఠినకష్టము
నుబెట్టితివా కట్టెడుము నిండామునింగిన వానికి చలిరాదు గదా
చంద్రమతీ యేమీ యీపాపగాలము.

గీ॥ కొడుకుజచ్చియు నివిటు ♦ మిడుకుచుండ
రాచబిడ్డనుజంపిన ♦ రక్కసనుచు
పట్టి తెచ్చిరి భటులు యీ ♦ పాపమెంత
కాల్చుచున్నదె మనలను ♦ కాంతయేమొ.

చంద్ర—రాజా! చెప్పుకొనెదను వినుము

గీ॥ బంధులుదేరితి మీతోడ ♦ బ్రతికియున్న
దానను కొడుకుతో జావ ♦ లేనిదాన
పోవుచుండగ దారిలో ♦ పోయినట్టి
శిశువున్నా కాలికిని జోక ♦ చింతనిడుచు.

తెలియక మనలో హితాస్యుడాయని పరికింపుచుంటిని అం
తట రాజభటులువచ్చి కొంతసొమ్ము నాపయిబడవేసి యిది
శిశువును జంపిన రక్కసిదనుని నన్ను బట్టుకొనిరి కొట్టిరి మరియు
కొట్టుకొనుచు రాజయొద్దకు తీసుకొనిపోయిరి. పోయిన రాజు
తత్క్షణమున తలగోయించమని యాజ్ఞాపించెను స్వామీ యిదినే
జేసిన నేరము మీపాదముల సాక్షి.

హరి—ఏమీ యీరాజులపరిపాలన అంతములకే రాజానామ్ నరకం ధ్రువం అని చెప్పినది న్యాయాన్యాయములు విచారించక శిక్షించినారు గాబోలు భటులు మెప్పువడవలెనని యెవరో జేసిన పని యీమెపయి వేసినారు విధివిధికూలము లేదప్పుడు మనుజుడే కార్యము జేయజాలడు దుర్లభము హా నా ప్రాణప్రదమైన యీ పతివ్రతలలామను చంద్రమతిని చంపుకొనవలసివచ్చెను.

గీ॥ యిన్ని యీవిధములనన్ను • చెన్నుమీర
కాచిరక్షించినట్టి యీ • కమలనయన
నెటులతలగోయవలసెను • యెట్టులనేను
జేయబూనెద నాపని • జేయలేను.

చంద్ర—ప్రాణేశా! ఆలసించెదరేల యిన్నికష్టములుంబడినను చివరకు నీచేతిలోనే నాకు చావుగలిగెను యికనాకు గావలసినదే మున్నది అనియునుంగాక పొందవలసినయమవాచకమును నాకిదే. యిక నాలసింపనక్కరలేదు స్వామీ! ఓయయ్యో మీకు యిదే నాకడసారి నమస్కారము.

హరి—ఛీ, హరిశ్చంద్రా! స్త్రీహత్యగూడా కట్టుకొనబోవుచుంటివి దక్షిణాపహ స్సమా నిపుణ్యము దహనమయినది ఖడ్గమా సకలరాజ్యసంపద విడిచినను కొడుకుచెడినను భార్య చావబోవుచున్నను నీవునన్ను వదలకున్నావు(అని చేతిలోనున్న ఖడ్గము వంకజూచి) చంద్రమతీ వధ్యశిలనెక్కి యీసారి భగవంతుని ధ్యానించుకొనుము.

చంద్ర—(అట్టులనే చేయుచున్నది.)

విశ్వా—(ఆతురుడై) హరిశ్చంద్రా! మీగురువే గెలిచెను నేను ఓడితిని ఆగుము.

హరి—ఏమోనాకు తెలియదు గాధేయ నీవుచెప్పవన్న.

విశ్వా—యిదిగో నేజెప్పుచుండిన నీవుచేయునన్ను అనుభవించెదవు (తనలో) నేనేమిజెప్పిన వినునట్లుగానేయున్నది.

హరి.—దేవీ! ధైర్యమునుబూనుము.

విశ్వా—(నటునిటుబరుగెత్తుచు) నక్షత్రకా రారన్న దేవేంద్రా! వైనరమ్ము. హరిశ్చంద్రా శాంతింపుము శాంతింపుము శాంత మేమంచిది. (ఒకచో నిలువలేనివాడై)

గీ॥ ఇంద్రమూలస్య మేలర ♦ విశ్వాకనేను
తగ్గిపిల్చుచున్న రా ♦ వెక్కలేల
నీవసిష్ఠ పెండ్లీయుయిది ♦ నిగ్గినపుడ
రండుమీరుశివభనాను ♦ లారరంపు.

(పార్వతీ, పరమేశ్వరులురాగ ఇంద్రుడును, వసిష్ఠుడును ప్రవేశింతురు)

పర-ఉ॥ ఓరిమిబూనుమయ్యబిర ♦ నుత్తమ వంశమునందుబుట్టితే
ధారుణిసత్యవాక్యమును ♦ తప్పకకష్టములెన్నివచ్చినన్
ధీరతనిల్పినావు దశ ♦ దిక్కులకెల్లను నీదుకీర్తి వి
స్తారమువచ్చిమెచ్చితిని ♦ సారవరంబులు గోరుమిచ్చెదన్

హరి—(అంజలిపుటుండై)

గీ॥ శరణుజయజయశంకర ♦ శరణుశరణు
మయముసిలీలజగతికి ♦ మయముమయము

భయము నీ భక్తులకు లేదు ♦ నయమునయము
రయము మెచ్చెను స్వామివి ♦ జయముజయము.

గురువరా నమస్కారము ఇంద్రా పదివేలవందనములు.

వసి——వత్సా! హరిశ్చంద్రా పరమేశ్వరుండు నీకు ప్రత్యక్షంబయ్యె కష్టములు దొలగును సుఖములు చేకూరును.

పార్వ——దేవీ చంద్రమతీ నీ పతివ్రతామహాత్మ్యమునకు మెచ్చితి వరములేమి కావలయునో అడుగుము.

చంద్ర——అమ్మా మీ యాదిదంపతుల దర్శనమయినవారికి తరు గేమున్నది చచ్చిపోయినరాచబిడ్డను బ్రతికించి నాయపవాద మును దీర్పుము.

పార్వ——అమ్మా నీకు మంచిగుణమునకు

ఆ॥ సూర్యచంద్రులున్న ♦ చోద్యకాలమునంత
నీకుపాతివ్రత్య ♦ నీకు సుగుణ
మెల్లవారిలోన ♦ యింపుగానుండును
సత్యసుందరవతి ♦ చంద్రమతి.

సంతోషించితి రాచబిడ్డతోపాటు నీకుమారుడు సజీవుడవుగాక లోహితా లేచిరమ్ము. (లేవనెత్తును)

(తలిదండ్రులు ఆలింగనముజేసికొందురు)

లోహి——అమ్మా: అవిగో నన్నుగఱచినపాములు నాయనెప్పుడు వచ్చాడే నే నాయుందగ్గరుంట.

హరి——నాయనా! వరములిచ్చుతాతగారు నమస్కారముజేయుము (నమస్కారము జేయుచున్నను)

పర—మంగళంభవతి హరిశ్చంద్రా! యిక నీరాజ్యము నీవు నేలుకొనుము.

హరి—అయ్యా, యీ వీరదాసునికింకా రాజ్యమా.

విశ్వా—రాజ్యముగాకేమి.

గీ॥ యముడునినుఁగొన్న వీరుండు ♦ నరయనిదియు
నొకమహాస్త్రశంబు గనుము ♦ నోర్పుతోడ
చంద్రమతిని గొన్నదియు యీ ♦ చంద్రధరుని
మిత్రుఁడనగరాహాయిటుల ♦ మేలుగాను.

హరిశ్చంద్రా! నీసత్యముగనవలెనని యీ సేసినదంత నేనే సకలసామ్రాజ్యము నేలుకొనుము సత్యకీర్తులు నీయింట స్నానమాడు.

పర—విశ్వామిత్రా! హరిశ్చంద్రునకు కిరీటముధరింపుము. పట్టాభిషిక్తునిగా జేయుము.

విశ్వా—ఆలాగే చేయుదును.

ఇంద్రు—అల్లనాడు మనసభలో నాడినమాట చెల్లించుము.

విశ్వా—ఓహో అనిమిషచెడనాయిదిగో హరిశ్చంద్రా నేను నూరువేల సంవత్సరములు కష్టించి సంపాదించిన తపఃశక్తి (ధారవోయును)

వసి—యిప్పుడెవరు గెలిచితిరి.

విశ్వా—గెలిచినదేమున్నది నావంశీకుడగు హరిశ్చంద్రుని సత్యసంధునిగా జేయుట కింత జేసితిని.

ఇంద్రు—నిజమునిజము.

గీ॥ వరసిననుగాని బంగరు ♦ వన్నెరాదు
తరసిననుగాని దధినుండి ♦ తరలువెన్న
కొలచిననుగాని దేవుడు ♦ కోర్కెలివడు
కలసిననుగాని సత్యంబు ♦ వెలికిరాదు.

వర— కీర్తన.

అడిగినవరములు యిచ్చెదమనుగుము॥

1. కలమయిం(డుడు కలడు వసిష్ఠుడు। కలడుకలడు గాధేయుడు
యిచట ॥ అడి ॥

2. ధరలోగంగుల వరనారాయణు । దరికిజేర్చిన దంపతులము
మేము ॥ అడి ॥

హరి— కైలాసవాసా నీకటాక్షముండిన జాలదా యికనేమికావలె

గీ॥ కలుపుగోలుతనంబున ♦ కలజనంబు
గలిగి మెలగి నెలకు మూడు ♦ గలిగివర్ష
ములు సకలజీవులును సుఖ ♦ ముగను(బతికి
తుదకుసౌఖ్యంబు వొచ్చుటె ♦ ముదమునొద్దను.

వర— తథాస్తు.

(అందరు నిష్క్రమింతురు)

శ్రీ భజన సత్య హరిశ్చంద్రీయము.

షష్ఠాంకము.

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ.

